వీరరాఘవ గ్రంథావళి

# మిత్రసాహస్రి

( కబీరు భావధారా సహితము )

*

బ్రతుకు వెలుఁగుఁబాటఁ బట్టి సుఖింపను,
బుద్ధి శాంతిసుఖము వొందుటకును,
విధి వివేక మెడఁద వెలసి సంస్కృతిఁ గూర్ప,
చదువు మిత్ర, మిత్రశతకములను।

*

# అ భి జ్ఞా పో ద ము లు

స్థాలీపులాకరీతికన్న కొంత మేలుగానే అందందు మీ మృదుమధుర రచనను చవి చూచినాను. ఒకమాటలో - వేమన్నరచనారీతికి సంస్కార సౌరభము నందించినారని చెప్పవచ్చునని తోచినది. సిద్ధహస్తులు, సుప్రతీతులు, పరిణతప్రజ్ఞులునగు మీకు ఇతరుల యుపోద్ఘాతాదులు వట్టి యాధునిక సంప్రదాయములుమాత్రమే.

భ వ దీ యు డు

డా॥ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

ఇందలి ఆటవెలఁదులు వేమన్నగారి ఆట వెలదులతో సయ్యాటము సలుపు చున్నవి. ఇవి అన్నియు అనావిద్ధ రత్నములే. శ్రీవీరరాఘవా చార్యులుగారు తమ జీవిత తపఃఫలముగా మనకందించిన రచనల నన్నింటిని చదివి ఆబాలగోపాలము ధన్యులు కావలయునని ఆశించుచున్నాను. ఇట్టి సద్గ్రంథమును తెనుగువారి కందించిన ఆచార్యులవారిని మనసార అభినందించుచున్నాను.

కవిసామ్రాట్

డా॥ విశ్వనాథ సత్యనారాయణ

ఈ శతకములందలి సూక్తులు కొన్ని శ్రీఆచార్యులవారు లోకాను భవముచేఁ జెప్పినవి; కొన్ని మృదువుగా హేళనచేసి సంస్కరింపవలెనను నుద్దేశముతోఁ జెప్పినవి; కొన్ని సంఘశ్రేయము కూర్పవలెనను నావేదన తోఁ జెప్పినవి. "బాహ్య రూపములనుబట్టి యెవ్వరికేని విలువ గట్టువాఁడు వెఱ్ఱివాఁడు", "శూలియైన శక్తి చూపక యున్నచో జగము గుర్తుపట్టఁ జాల దతని", "పదవియందు దొకందు బాంధవుఁ డుండెనా యెట్టి చవటయాటలేని సాగు", "జనులసేవ చేసి జాతిని వెలయింపఁ దలఁచు నీతిపరుఁడు" మున్నగున విందుకుఁ దార్కాణములు. శ్రీఆచార్యులవారు

భేదబుద్ధి విడిచి మానవుఁడు విశ్వపౌరుఁడు కావలెననియు, మానవత్వమును విడిచినచో దానవుఁ డగుననియుఁ బలుచోట్ల చెప్పియున్నారు. అట్లే పార మార్థిక విషయములను గూర్చియు యోగ రసవాదాది విషయములను గూర్చియు వారు తెల్పిన యంశములు వారిపాండితీవైభవమును, శాస్త్రాను భవమును, ప్రపంచపరిశీలనమును జాటుచున్నవి.

డా॥ దివాకర్ల వెంకటావధాని

ఆటవెలదీ, తేటతెలుగూ జట్టు కట్టినప్పుడు సూటిభావం సుందరతర మవుతుంది. ఏమన్నా, వేమన్నగారు మన కిచ్చిన వారసత్వాన్ని కొందరే వాడుకొంటున్నారు. శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులుగారి ఈ గ్రంథం విశ్వదాభిరామంగా ఉంది. వేమన్నగారి అడుగుజాడల్లో రాణించేవాళ్ళకి అభ్యుదయదృక్పథం తప్పనిసరి. అయితే కొండూరువారుమరో మెట్టుపైకి వెళ్ళారు. హేమకారవిద్యనూ ఈసడించారు. శబాస్ ! శ్రీ వీరరాఘవా చార్యులుగారికి నా అభినందనలు.

-ఆరుద్ర

ఈ పద్యాలు శ్రీ ఆచార్యులుగారికి తెలుగులో వేమన్నతోను, కన్నడంలో సర్వజ్ఞునితోను, తమిళంలో తిరువళ్ళువార్‌తోను- సమాన స్థానాన్ని కల్పిస్తున్నాయి.

డా॥ తూమాటి దోణప్ప.

ఎన్నెన్ని రీతులు, రివాజులు, నీతులు, గోతులు, సత్కృతులు, దుష్కృతులు - ఒకటేమిటి లోకప్రవృత్తి సర్వం ప్రతిబింబించుకున్న కృతి ఇది. జీవితానుభవాన్ని చెప్పేతలపే తన కృతికి నాంది అని ముందే విన్నవించుకున్నారు కొండూరువారు. రోజూ అందరూ చూసే సత్యాలనే ఎంతో రుచిమంతంగా సంతరించారు. అపారమైన లోకానుభవం, దాన్ని చిత్రించగలిగిన వాగ్బలం పుష్కలంగా ఉన్నగ్రంథం ఇది.

డా॥ సి. నారాయణరెడ్డి

శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులుగారు కవిగా - విమర్శకులుగా ఆంధ్రలోకానికి పరిచితులు. సాహితీవిమర్శనాదృష్టే గాకుండా, సమాజ విమర్శనా దృష్టిగూడా గలవారు.

సమకాలీన సమాజంలో, అడుగడుగునా తటస్థపడే, కపటము-మోసము - మతమౌఢ్యము - కులస్పర్ధ - జీవహింస - నాస్తికత - అసమత - దోపిడి - దౌర్జన్యము - మొదలయినవాని ఉద్దీపనవలన సదుద్రేకంతో - ఉద్వేగంతో - అతిసహజ ధోరణిలో - వెలికుబికిన భావపూర్ణ కవితాఖండాల సంపుటి ఈ గ్రంథం.

శ్రమకు విలువ నీయనట్టిది మన సమాజము. పని ఏమీ చెయ్యకుండా పరాన్నభుక్కులుగా వుండినవారికి మొదటినుండీ మన సమాజంలో గౌరవం వున్నది. కాయకష్టం చేసి సమాజావసరాలు తీర్చేవారికి విలువ యేనాడూ లేదు. అట్లా హాయిగా తిని కూర్చోడానికే కులతత్వాన్ని పెట్టి శ్రమకు విలువ లేకుండా చేశారానాడు. సమాజంలో అందరూ చదువుకోవచ్చు అన్నసిద్ధాంతం వ్యాప్తిపొంది సమత్వం అంటే యేమిటో తెలిసికొన్నాక ఆ రహస్యం బయటపడింది. ఈకులతత్వాన్ని నిర్మూలిస్తే నేతప్ప సమాజంలో "శ్రమవిలువ" (Dignity of labour) గుర్తింపబడదు. అందుకే ఈకవి "కాయకష్ట మించుకయు నొనర్పక నీకు, తిండితినెడుహక్కు నిండుసున్న" అన్నారు.

రచన చక్కనిశైలిలో సాగింది. వేమన పద్యాలు చదివేటప్పుడు ఏ సహజత - ఏ సౌలభ్యం - ఏ హాయి ఏ వూఅట - పొందుతామో ఈ పద్యాలు చదివేటప్పుడు గూడ, అవే పొందుతాము. విషయంవల్లనే గాకుండ శైలివల్లగూడ కలిగిన మహిమ ఇది. ఆంధ్రపాఠక లోకంలో ఈగ్రంథం మిత్రసమ్మితంగా ప్రచారం పొందగలదనినా విశ్వాసం.

డా॥ జి. ఎన్. రెడ్డి.

A treasure - house of wisdom, this book, coming from the Pen of "Abhinava Vemana" deserves to be treasured in every Telugu house.

"TRIVENI"

## కృతజ్ఞత

1971లో "మిత్రపంచశతి"గా ప్రకటితమైన ఈ పుస్తకం వేయి పద్యాలను సంతరించుకొని ఈనాడు "మిత్రసాహస్రి"గా వెలువడుతున్నది. ఈ సాహస్రిని కూర్చడంలో పంచశతిలోని శీర్షికాక్రమం, పద్యక్రమం కొంత మార్చవలసి వచ్చినది. ఇందులో పారమార్థికశాఖకు చెందిన పద్యాలు-సాంఖ్య 'వేదాన్త, శ్రీవిద్యాదర్శనాదులను అనుసరించి నడచినవి. కనుక పాఠకులు వాటిని అలాగే అర్థంచేసుకోవాలి. పంచశతిమీద విద్వత్కవులొసగిన అభిప్రాయాలలోని కొన్ని వాక్యాలను మాత్రమే ఇందులో అభిజ్ఞాభిప్రాయాలుగా సంగ్రహించు కోవడమయినది. మొదటినుండీ నాకృతులమీద అధికాదరాభిమానాలను చూపుతున్న కవిపండిత లోకానికీ, పాఠక ప్రపంచానికీ, ముద్రణకు సహకరించిన ఉదారులకూ హార్దిక కృతజ్ఞతలు.

తెనాలి
4–8–79

గ్రంథకర్త

—o—

# సూచిక

—o—

# మిత్రసాహస్రి

## ప్రథమ శతకము

ఆటవెలఁది వలచి అర్థమా తెనుఁగున
అమృతవృష్టి గురిసినట్టి ఘనుని
వేమనార్యు నెవరు విస్మరించెద రిల
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 1

గ్రుడ్డినమ్మకములఁ గూలఁద్రోయుచు కాక,
మతవిరోధములను మట్టు వెటు
బ్రహ్మగురునిబోధ పాటింప రెవ్వారు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 2

వెలయఁజేసె వేమువలె జగచ్ఛిల్పంబు
నెవ్వఁ డాటవెలఁ నివ్వటిల్ల;
రక్తిఁ దెలతు నా పరబ్రహ్మతీర్థుల
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 3

"నవయుగాలబాట నార్లమాట" యటంచు
వేమ్రుత్రోవలోన విస్తరించె
సూక్తు లెన్నొ అట్టి సూరి నార్లఁ దలంతు
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 4

---

1. బ్రహ్మీభూతులు శ్రీ కోలవెన్ను పరబ్రహ్మతీర్థులవారు "జగచ్ఛిల్పము" అను వేయి పద్యాల తత్త్వగ్రంథమును వ్రాసినారు.

వేమనార్యుఁబోల వేడుక లే దింత,
బ్రహ్మగురునిబోలు వాంఛ లేదు,
వారిత్రోవ నచ్చ వ్రాయఁబూనితి నాట
వెలదు లొక్కవేయి వినర, మిత్ర ! 5

కలద లెన్నొ మున్ను కలిపిరి పెద్దలు
సంస్కృతాంధ్రముల నసంఖ్యముగను;
యుగము ననుసరించియును కొన్ని వెలువడు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 6

వేదయుగమునుండి వెలయుచునే యుండె
వేనవేలు సూక్తి విస్తరములు;
ఆచరించువారె అరుదైరి లోకాన !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 7

ఇంట నిండి యున్న ఇరులను బోకార్చు
దీప మట్టు లెడఁద తెగులు మాన్పు
సాధుజనుల సూక్తి సారామృతరసంబు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 8

జీవితానుభవము చెప్పెడి తలఁపును
నా ప్రయత్నమునకు నాంది యయ్యె,
భావ మొక్కటైన పలుకుతీరులు పెక్కు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 9

పూర్వకవులు చెప్పనేర్వని క్రొంగ్రొత్త
పలుకువాఁడ నంచు ప్రతిన పూన;
ప్రాఁత లెడఁద నరుగ ఫలియించె నీకృతి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 10

బ్రతుకు పండి సిద్ధి ప్రాపించు నని బుద్ధిఁ
దలఁచి తలఁపు లిట్లు పలుకుచుంటి;
ఉపకరించెనేని ఒరులకుఁగా మేలవు
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 11

పద్య మొక్కటొకటి పనిచేయు మిత్రమై
బ్రతుకు తీర్చి దిద్ద, వెతల మాన్ప
సత్పురుషు నొనర్ప, సత్కార్యపరుఁ జేయ
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 12

మంచిమాట చెప్పు మానవుల్ పెక్కురు,
చిక్కఁ డొక్కఁ డేని చేయువాఁడు,
చేయువాని కబ్బు చిర సుఖ శాంతులు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 13

సంఘమునకు మేలు సమకూర్చు క్రొంగ్రొత్త
నొల్ల నట్టి మూర్ఖు లుంద్రుగాక;
అనుమతించు దాని నార్యుండు సుమతియై!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 14

మధుర భాషితములు మాణిక్యములు వోలె
శ్రుతి నలంకరించి, మతి వసించు;
మంజులములు గానిమాటలు నిలువవు
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 15

చూతఫలము లట్టి సూక్తులు విజ్ఞుల
తృప్తి పఱచి మెప్పు దెచ్చు కవికి;
పొల్లుమాట లెగిరిపోవు నాకులు వోలె!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 16

గుణము మెచ్చలేని కుమతి జీవిత మెన్న
పందిబ్రతుకువోలె పంకిలంబు;
సుమతి వగుము మంచి స్తుతియించి మనసార!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 17

దుర్జనుండు పరుల దోషాలనే యెన్ను,
సజ్జనుండు గుణము సంస్తుతించు,
ఈగ పుండు వెదకు, ఎలదేటి పద్మంబు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 18

చిలుక, గువ్వ, నెమిలి, చిన్నారి రాయంచ
కోకిలమ్మ — యన్న కుతుక మేల !
గుణమునకు జగంబు కొసరి జే జే పెట్టు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర 19

గ్రుడ్లగూబ, కాకి, కొంగ, రాబందువు,
గబ్బిలం బటన్న కసరు కొంద్రు;
గుణము లేనిదానిఁ గొండాడునె జగంబు ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 20

బాహ్యరూపములను బట్టి యెవ్వరి కేని
విలువ గట్టువాఁడు వెట్టివాఁడు;
ఎట్టి పుట్టలోన ఎట్టి పాముండునో !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 21

కాంతమీఁదికంటె కనకమందునకంటె
పేరుమీది వలపు పెద్ద; దాని
వీడినట్టి జనుఁడు విశ్వమందుండునా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 22

జీవితమున విజయసిద్ధి దుష్కర మెన్నొ
సిలుగు లోర్చి కార్యములను దీర్చి,
సమానమునను దాని సాధింపవలెనురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 23

బ్రతుకునౌక నొడ్డు పట్టింపఁగల నేర్పు
బ్రహ్మచర్యమందె పడయువాని
భావి జీవితము సుఖావహమై క్రాలు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 24

పడుచుఁదనము నరుని భ్రష్టు నొనర్పంగ
వచ్చె; దాని బారిఁ బడక తిరుగు
యువకు బ్రతుకు ధన్య ముత్కృష్టమవుఁ జుమీ !
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర ! 25

అగ్గి మిడుత గుంపు నాకర్షణము సేయు
లాగు వ్యసనచయము లాగు నరుల;
వాని గెలుచువాని వర్తన వర్తన !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 26

స్వార్థమునకు నరుఁడు సత్య ధర్మంబుల
పీటబుచ్చి తిరుగు విచ్చలవిడి,
స్వార్థ మెంతకైనఁ జాలు పిశాచిరా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 27

ఇల పరార్థ జీవు లెంద ఱుందురు వృక్ష
ములను బోలి కష్టముల సహించి
సతము లోకసేవ సల్పు మహాత్ములు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 28

ప్రళయమందు కూడ బరి దాటకుండెడి
నియమవంతు లెచట నేని అరుదు;
కొండలట్లు వారు కొంకరు, జంకరు,
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 29

ఒరుల కష్టసుఖము లూహించి తనవిగా
తీర్ప, చేర్ప సుమతి దివురు చుండు;
కుమతి యపకృతులనె గూర్చును పరులకు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! ౩౦

తేలు కుట్టి బాధ తెచ్చిపెట్టునె గాని,
తొలఁగఁజేయ దాని వలఁతి గాదు;
దుర్జనుండు కీడె తొడరి చేయఁగలాఁడు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! ౩౧

తల్లిఁ దండ్రి గురువు దైవముఁ బూజింప
లేనివాఁడు బుద్ధి లేనివాఁడు;
వారు లేక తాను వసుధ వెల్గొందునా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! ౩౨

## అతివ

అతివ గారవించె నర్ధదేహ మొసంగి
సర్వవంద్యుఁడైన శంకరుఁడె;
నరుఁడనాదరించి నగుబాటు పాల్గాఁడె !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! ౩౩

తరుణి నియమశీల, తాలిమి పెన్నిధి,
మగువ త్యాగమునకు మారు పేరు;
రక్తి, భుక్తి, ముక్తి రమణి చేకూర్చురా !
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర ! 34

పడయఁజాలనట్టి బాధల పాలయి
మాతృభావ మందు మహిళ లెంత
పూజనీయురాండ్రొ పోలిచి చూడరా !
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర ! 35

అతివ మగని తేజ మాత్మగర్భంబునఁ
దాల్చి ప్రోది సేయు; తరుణి కట్లు
మదిని చోటొసంగి మనవలె పురుషుండు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 36

జీవితేశుకొఱకు, చిన్నారి బిడ్డల
కొఱకు స్వీయసుఖము కోలుపోయి
వారి క్షేమమునకె వర్తించు శ్రీమతి;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 37

గౌరవముగ సాగు గార్హస్థ్య శకటంబు
ఆలుమగలు సమత నంది లాగ;
విషమబుద్ధులైన వెతలపాలౌ బండి;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 38

సతికి భర్త దైవసముఁ డైనయట్టులె
సతియు పతికి దైవసమమె కాదె!
ఉభయు లిట్లు తలఁప నొదవదా సంసిద్ధి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 39

ముక్తిపథము సాగ ముదిత విఘ్నం బను
పలు కధీరమతుల పట్ల నిజము;
ధీరమతికి ముక్తి తెరువు చూపును కాంత!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 40

ఆలు బిడ్డ లాది యగు బంధుతతి, ఆత్మ
ముక్తి కడ్డు రారు; యుక్తి వారి
మోక్షసాధనముగ మొనసి తీర్చెద వేని;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 41

కొమ్మ నాపదలకు గుఱిచేయు నెంతటి
దండివాని కేని దగులు కీడు,
కాన సతుల సతము గౌరవింపఁగ వలె,
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 42

మగనిఁ గాల్చి తినెడి మగువయు, మగువను
చంపి తినెడి మగఁడు సంఘమునకె
చీడపురుగు లౌట చెడు వారి సంతును;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 43

ప్రణయమూర్తియైన పడఁతి వాగురఁజిక్కి
మాతృమూర్తిఁ దెగడు మనుజపశువు
ఉభయలోకముల సమున్నతి గనఁడ్రా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 44

మగనిఁ దిట్టి, యత్తమామల వేధించి,
కన్న సంతు సుఖము కాలఁదన్ని,
కాటఁగలుపు నిల్లు గయ్యాళి పెండ్లాము;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 45

ఆలుమగల కలహ మంకురింపగ రాదు,
అంకురించి శీఘ్ర మణఁగ కున్న
కూలిపోవు కొంప కూకటి వేళ్ళతో !
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర ! 46

తప్పు లేనినరుఁడు ధరణిఁ బుట్టగఁ బోఁడు;
ఒకరితప్పు లెక్క రోర్చుకొనుచు
తమ్ము దిద్దుకొన్న, తగ వేల తల యెత్తు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 47

కల్ల లాడి యిల్లు కడఁగి నిల్పుట నేఁడు
చెల్లదింత; బడుగు - చెనటి మగఁడు
భార్య, బిడ్డ, పాప బ్రతికింపఁ జాలునా ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 48

# అత్తా కోడళ్ళు

వినయశీల మైన, విజ్ఞురా లైనను,
చదువుకొన్న దైన, సాధ్వియైన
కోడ లెప్పు డత్తదాడికి లోనవే
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 49

అత్తవారియింటి క త్తి కోఁతల కింది
జీవితంబు బలిగ చెల్లిపోవు
దుష్టదశ యిఁ కెప్డు దూరమై పోవురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 50

చెడ్డకూఁతు నైన శిరముపై నిడుకొను
నత్త కోడ లెంత మెత్త నైన
మొత్తఁజూచు, నింద మోపనే చూచురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 51

మంచియత్త కిలను మంచిదా కోడలు,
మంచికోడలికిని మంచి యత్త
దొరకు టెంత సుకృత పరిపాక మోగదా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 52

—0—

# భోగత్యాగములు

—o—

ఉచిత భోగములను నుచిత కాలములందు
మితము మీరకుండ మెసవవలయు;
భోగలాలసతకు లోఁగిన హానియౌ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 53

భోగ్యవస్తు వితతి పుష్కలంబుగ నున్న
మితము మీరి యెవఁడు మెసవకుండు
అట్టివాని నిగ్రహాత్ముఁ డంచనవచ్చు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 54

అంగపాటవంబు భంగమందినఁ గూడ
భోగవాంఛ విడని రోగులెన్న
పంది మూఁకలకును భ్రాతలుగారొకో !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 55

వార్ధకమున విషయ వాసనల్ విడలేక
భోగములను గుడువఁబూను జడులు
ఆ యయాతి నృపతి కన్నదమ్ములు గారె !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 56

భోగమందుకంటె త్యాగమం దెక్కువ
ఘనత, శాంతి, తృప్తి కలదు గాన,
కష్టమైన త్యాగిగా మనుటే లెస్స;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 57

భోగి స్వార్థపరుఁడు, త్యాగి పరార్థైక
జీవనుండు, సర్వ జీవకోటి
హితముకొఱకుఁ దన్ను హెచ్చించు కాన్కగా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 58

భోగివైన మెచ్చఁబోవ రెవ్వరు నిన్ను;
త్యాగివైన ప్రాణితతులు సొంత
కష్టములను దీర్పగా నాశ్రయింతురు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 59

ఎన్నిమారు లనుభవించిన నొక్కటే
రుచి యటంచెఱింగి రోఁతచెంది
మేలి కార్యములకు కాలంబు వెచ్చించి
విశ్వహిత మొనర్చి వెలయు మిత్ర! 60

కాలకూటవిషము కబళించి యమృతంబు
సురల కొసఁగలేదె పరమశివుఁడు
అతని త్యాగమహిమ ఆదర్శమౌఁ గదా!
విశ్వహిత చరిత్ర వినర, మిత్ర ! 61

మతవిరోధములను మట్టువెట్టి స్వదేశ
హితముఁ గూర్ప ప్రాణమిచ్చి నట్టి
మన మహాత్ము త్యాగమహిమ సామాన్యమా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 62

—o—

# కులము

—0—

కులబల మ్మొకండు, కలిమి బలంబును
ఏలుచున్న విప్రులెల్ల జగతి;
రెండు లేక పండితుండైన నెలుఁగఁడు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 63

కుల విభేదములను గూల్ప బుద్ధాదులు
చేసినట్టిబోధ చెరగె; మఱల
కృతక కులపిశాచి క్రీడించు చెలరేఁగి;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 64

అగ్రవర్ణమంచు, అంత్యవర్ణమటంచు
కృతక భేదములను సృష్టిచేసి
మనుజులందు సమత మంటపాల్చేసిరి;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర 65

గుణము ననుసరించి కులములు జన్మించి,
గుణగణమ్ము నెందో కూలఁద్రోసి,
తామె పెత్తనమ్ము తగనొనర్పఁ దొడంగె;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 66

పూజనీయగుణము పూజింప నొల్లక,
జాతి కేల జగము జయలు పెట్టు ?
రసము వీడి పిప్పిఁ గొసరి మూగినయట్లు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 67

చదువరాదు శూద్ర సంఘంబు వేదాల
నంచు వ్రాసినార లచ్చెలువుగ
తెల్లదొరలు చదివి దివ్యార్థములు చెప్ప
నోరు మెదపరేమి వీరు మిత్ర ! 68

యాజకత్వమునకు అగ్రవర్ణ మొకండె
అర్హమంట, పరు లనర్హులంట !
ఎంత స్వార్థబుద్ధి ! ఎంతటి వంచన !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 69

బోయ, తపముచేత పూజ్యర్షిగా మారి
సర్వజన హితమ్ము సలుపలేదె !
జాతికన్న మిన్న జ్ఞాన తపస్సులు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 70

కులము తక్కువంచు చులుకగఁ జూతురు
గుణము లేక కులము గొప్ప దగునె?
పూజ్యఋషి గణంబు పుట్టిన కులమేది ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 71

ఆఫ్రికనులె యైన, అమెరికా వారైన,
నల్ల తెల్ల యెఱ్ఱ నరులె యైన
పాంచభౌతికములె వారల దేహాలు;
కాన సోదరులని కాంచు మిత్ర ! 72

ఒక్కతల్లిబిడ్డ లుండరే పలురంగు
లెనసి యట్లె విశ్వజనులు గూడ
వివిధ వర్ణులైన వేర్పరింపగనౌనె !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 73

మనసు పక్వమైన మాదిగ యగుఁ గాక,
ఆత్మబోధ మంద నర్హుఁ డగును,
కక్కనికి * గురుండు కలుపఁడా జ్ఞానంబు ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 74

కుల విభేద మెపుడు కూలునో, ఈ జాతి
భేదవాద మెపుడు ప్రిదిలి విశ్వ
జనము లొక్కటనెడి జ్ఞానంబు కలుగునో
నవ యుగోదయంబు నాడె మిత్ర ! 75

కులముపేర నరుల నలిపివేయు దినాలు
గడచిపోయె; నిపుడు గౌరవంబు
గుణికి నిచ్చి, దిద్దుకొనుఁడు చేసినతప్పు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 76



---

* గురుడు = బ్రహ్మంగారు.

పంచముడు

పంచముల బహిష్కరించుట పాడియా ?
పంచజనులు గారె పంచములును !
హరిజనాఖ్య నిచ్చి హర్షించె గద గాంధి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 77

పామర ప్రపంచ భావనఁ దిలకించి
అంటరానివార లనిరి వారి;
ఆత్మదృష్టిఁ జూడ ఆత్మీయులే గదా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 78

శైవవైష్ణవములు, శంకరాచార్యుండు,
బ్రహ్మదేశికుండు-పంచములను
ఆదరింపలేదె ఆత్మజ్ఞులౌటచే !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 79

అన్యజాతిగురుత కంజలించెడువాఁడు
స్వీయజాతివాని శిష్యునిగను
స్వీకరింప వెఱచు; చిత్ర మీ మూర్ఖత !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 80

అగ్రజాతివారి యడుగుల ద్రొక్కిళ్ళ
నలిగి తెలివి దప్పినారుగాక,
దేశభాగ్యగరిమ దీర్చి దిద్దగ లేరె !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 81

కొత్త జీవితంబు, కొత్త సిద్ధాంతాలు
కొత్త మానవులును, కొత్తమాట
లుద్భవించి జగము నుద్ధరింపఁగవలె
కుళ్ళుపాఁత వెళ్ళఁగొట్టి మిత్ర ! 82

—o—

## కలిమి

డబ్బు పనులనెల్ల గొబ్బున సాధించు;
డబ్బు పెద్దఱికము నబ్బఁజేయు;
డబ్బులేనివాఁడు డుబ్బుకు కొఱగాఁడు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 83

ద్రవ్య మున్నవాని దరిఁ జేరి మనుజులు
పొగడుచుంద్రు స్వార్థమును గడింప;
ధనములోన నెల్ల గొనము లుండునుగదా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 84

డబ్బుఁ జూపినంత నుబ్బి తబ్బిబ్బయి
వేంకటేశ్వరుండె శంక లేక
జనుల కోరికలను సమకూర్చు నందురు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 85

సొమ్ము చిన్నచూపు చూచిన, నేఁ డెట్టి
విజ్ఞుఁడైనఁ గాని వెతలఁ గుందుచుఁ;
గాన పాడి విడక గడియింవలె లిబ్బి;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 86

కానలందు నిల్చి, కాయలాకులు దిని,
కొలనినీరు ద్రావి, గుహలఁ బండు
కాల మిద్ది గాదు; కావలె ధన మిప్డు ;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 87

—*—

## ఓటు

ఓటులోన మణఁగి యుండె భావిచరిత్ర,
దేశభాగ్యగరిమ తీర్చి దిద్ద
ఓటు సాటిలేని ఉత్తమసాధన !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 88

ఓటు విలువ నెన్న మాటలు చాలునా !
ఓటనంగ నోటిమాట కాదు ;
ఓటు కోటిసేయు హాూన్నల మూటరా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 89

సర్వజన హిత ప్రజాస్వామ్య యుగమున
కార్యసాధకంబు గాదె ఓటు !
ఓటు మంచివారి కొసఁగిన మేలవు ;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 90

ద్రవ్యమునకు లోఁగి, ప్రభుతకు తలయొగ్గి,
చుట్టఱికము, కులము చూచి మురిసి
ఓటు తగనివారి కొసఁగిన మేలౌనె !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 91

అర్థమునకు ఓట్ల నమ్మెడి దేశాన
సాఁగఁ జాలునే ప్రజాప్రభుత్వ
మందఱకును విద్య, ఆలోచనాశక్తి
పట్టువడక యున్న పరమ మిత్ర ! 92

ఓటు నీయకున్న ఉత్తము నేనియు
బాధపెట్టు, దోచు, పట్టు, కొట్టు,
ఇండ్లుతగులఁబెట్టు నెన్ని యిబ్బందులో
కూర్చు క్రూరనాయకుండు; మిత్ర ! 93

ఉత్తమోత్తములకె ఓటిచ్చి జను లేల
మంచి రాచఱికము నెంచుకొనరు !
నరుల నీతిబలము నట్టేటఁ గలసెనా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 94

కూరకేని, ఉప్పుకోసరమేని, మో
మోటకేని, డబ్బుమూటకేని
ఓటు నమ్ముకొనుట ఒప్పునా నరులకు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 95

జనుల సేవ చేసి, జాతిని వెలయింపఁ
దలఁచు నీతిపరుఁడు ధనము పోసి,
ఓట్లు కొనఁడు పదవి ఒదవిన, రాకున్న
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర! 96

—*—

# వినోబా పథముం

ఆధునిక మహర్షి యగు వినోబామార్గ
మఖిల మానవాళి కభయముద్ర,
విశ్వశాంతిదాయి; వెడలు మా బాటను!
విశ్వహిత చరిత్ర వినర, మిత్ర! 97

నరుఁడు వానరుఁడుగ, నారాయణుండుగా
మాఱవచ్చు వాని మనసుచేత,
నడతచేత; మంచినడవడి నెన్న నౌ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 98

సామ్యయోగ రథము సర్వోదయ పథాన
నడపి శాంతితోరణములు కట్ట
నుద్యమించు టిప్పు డుత్తమ ధర్మమా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 99

"జై జగ,, త్తటంచు చాటిన పెద్దల
మే లితలఁ పులోని కీ లెఱింగి,
సంకుచితపు దృష్టి సడలింప లగ్గగు ;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 100

చెప్పువారి సంఖ్య చెప్పలే మింతని,
చేయువారి సంఖ్య చిన్న దెంతొ ;
చేసి చెప్పువారు చిన్మయమూర్తు లే !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 101

విమలశీలు డైన వెంపటి సూర్యనా
రాయణునకు సామ్యధీయుతునకు
అంకిత మ్మొనర్తు నాదిమ శతకంబు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 102

— 0 —



స్వర్గీయ

శ్రీమతి వసుంధరాదేవి

| జననము | మరణము |
|---|---|
| 15–12–1948 | 19–3–1970 |

పూతచరిత సాధ్వి పుణ్యాత్మ స్వర్గీయ
ప్రాజ్ఞ మా వసుంధరాకుమారి
కీ ద్వితీయ శతక మిత్తు నంకితముగ ;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర !

ఇరువది రెండేండ్లు

నిండీ నిండని లేబ్రాయములో

సంస్కృతాంధ్రాగ్ల హిందీ భాషా పరిధులతో

పరిభ్రమించి

ఉభయ వంశములను యశోభూషలతో

అలంకరించి

అకాల మృత్యుదేవత ఒడిలో

హాయిగా నిద్రించిన

ఆత్మజాత

శ్రీమతి వసుంధరాదేవికి

ద్వితీయ శతకము

అంకితము

# ద్వితీయ శతకము

## కళ

విజ్ఞులైన వారు విని మెచ్చుకొన్నచో,
గణుతి కెక్కు కవుల కావ్యసృష్టి;
వా రసూయ పూని వదలిన నశియించు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 103

సృష్టి ననుభవించు జీవులు లేకున్న
కమలభవుని సృష్టి కాటఁ గలయు;
కళల సృష్టి యంతె గ్రహియింపకుండిన !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 104

మత్సరంబులేని మహనీయ మూర్తులు
బోద్ధలైన కళలు పొందు ఘనత;
సద్విమర్శ వలన సఫలత చిక్కదా !
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర ! 105

కళకు విలువగట్టు కాలాన నావాఁడు,
పరుఁ డటన్న భేదభావ మున్న,
కళకు న్యాయమెట్లు కలిగింతు రార్యులు ?
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర ! 106

కళ జగమ్మునకు వికాసమ్ము సమకూర్చు,
చింత లడఁచు, మదికి శాంతినిచ్చు,
కాలు మోపఁజేయు కర్తవ్య పథమున;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 107

కళ లొనర్పలేని కార్యమ్ము లిల లేవు
హృదయముల వశీకరించు కొనుచు
కల్పలతలువోలెఁ గలిగించు ఫలముల;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 108

అన్ని కళల లక్ష్య మానంద సిద్ధియే,
నదుల కెల్ల గమ్య ముదధియె కద !
అన్యసిద్ధు లౌ నవాంతర ఫలములు,
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 109

కావ్యములను వ్రాసి గణుతి కెక్కినవారు,
కావ్య లోక కీర్తిఁ గన్నవార
లగుమహాత్ము లెప్పు డారాధనీయులు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 110

శిల్పముల జగమ్ము సేవించు శిల్పులు
శిల్పముల విధాన చిరము జగతి
కర్చనీయు లౌట అవమతింపకు వారి;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 111

## మానవత

అమృత మారగింప నారాటపడుదురు,
చేదు మెసవ నెవరు సిద్ధపడరు;
కాన నమృతమూర్తి కావలె మనుజుండు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 112

గులకరాళ్ళు దొరకు కోకొల్లలై యెందు,
రత్న మొదవ దెంతొ యత్నపడిన;
మంచిమనుజు డిట్లు మహి దుర్లభుండురా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 113

గాజుపూస మణియు కన నొక్క రూపైన
మణి గుణంబుచేత మాన్య మగును;
విలువ గుణము తెచ్చు వెలిరూపు గాదురా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 114

మంచి పనులు సేత మానవ ధర్మంబు,
చెడ్డ సేత జంతు చేష్టితంబు;
నరుడు జంతువౌట న్యాయమా తలపోయ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 115

డంబు మీఱ నేడు డాక్టర్లు, యాక్టర్లు,
అణువు పొట్ట చీల్చునట్టి ఘనులు
కలరు వేలకొలది; కఱవైరి మనుజులే!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 116

డాక్టరైన, పెద్ద యాక్టరైనను గాని,
మేయరైన, మేటి లాయరైన,
మానవత నశింప మహి కీర్తి గనలేఁడు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 117

మొదట మాఁనవుండు, పిదప నెట్టివాఁడు నైన,
పిదపదానఁ గీడు మొదటి కైన,
మొదలు చెఱుచు దాని మొత్తంగ రాదొకో !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 118

మానవుండు జగతి మానవత్వముతోడ
మనుట లెస్స - యెన్ని ఘనత లున్న,
మానవతను వీడ, దానవుఁ డగుఁ గదా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 119

చంద్రలోకమునకుఁ జని మర్మము లెఱుంగుఁ
గాని, యిరుగుపొరుగు మానవాళి
సేమ మరయఁబోఁడు, చిత్రమా విజ్ఞాని !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 120

తనకు మేలు చేసికొనునట్టు లొరులకు
హితము గూర్పఁ బూను టెల మనుష్య
ముఖ్యలక్షణమ్ము, మోదమా సద్జ్ఞాన !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 121

సొంత సుఖముమాట సుంత యోజింపక,
పరుల సౌఖ్యమునకె పాటుపడుట,
దైవ లక్షణముగఁ దలఁచెద రార్యులు ;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 122

బ్రతికినన్నినాళ్ళు పరహితమే చేయు,
చచ్చికూడ మేని చర్మమిచ్చు;
పశువునుండి నీతిపాఠాలు గొనవచ్చు ;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 123

పరుల స్వార్థమునకు బలిగొంద్రు దైత్యులు;
లాభ మేమి లేక లాతివారి
కెగ్గు చేయువార లెవ్వరో యెఱుగము !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 124

అల్పబుద్ధి దోష మావిష్కరించును,
దొడ్డవాఁడు దాని తొడరి మ్రింగు;
అబ్ధిఁ బుట్టువిషము నభవుఁడు మ్రింగఁడా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 125

శిష్టుఁ డెప్పుడు గుణము శిరసావహించును
చందమామనట్లు శంకరుడు;
దుర్జనుండు గుణికి దోష మాపాదించు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 126

ఒక్క వ్రేలి నొరుని దిక్కు చూపితి వేని
వెక్కిరించు మూఁడు వ్రేళ్ళు నిన్ను;
తప్పు లేనివానిఁ జెప్పు మొక్కని నేని !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 127

మొగలిపూల నున్న ముండ్ల చందంబున
మంచివారి నాశ్రయించి ఖలులు
పరభయంకరులుగ తిరుగుచు నుందురు ;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 128

పైకి కమ్మనైన పల్కులు చెప్పుచు
గుండె చేదు నింపుకొన్నవారు,
తేనె పూసినట్టి తీయని కత్తులే ;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 129

అగ్గిమంటవోలె అర్యుఁ డున్నతి వెల్గు;
నీచు, దిగువ కేగు నీరు వోలె;
అనిల మట్లు లధముఁ డడ్డదిడ్డము సాఁగు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 130

ఇరుగు పొరుగు లన్న నెడపని కూర్మితో
కలసి మెలసి మెలఁగఁ గలుగు సుఖము;
పొరుగుపోరు సెజ్జ నురగ మున్నట్టులే !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 131

ఆధునిక యుగమున అవనీతలం బెల్ల
ఒక కుటుంబమట్లు లుండఁ జూచు;
విశ్వపౌరుఁ డనఁగ వెలయుట కదె త్రోవ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 132

దాంపత్య యోగము

ప్రకృతి పురుషుఁబొంది పరిపూర్ణత గడించు;
పురుషుఁ డట్లె ప్రకృతిఁ బొంది మురియు;
ఉభయ సామరస్య ముత్తమ సృష్టియౌ;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 133

శివుఁడు శక్తి లేక సృష్టింపఁ జాలఁడు,
శక్తి, శివుఁడు లేక రక్తి గనదు;
శక్తిశివుల మధుర సామరస్యమె సృష్టి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 134

ప్రకృతి పూరుషులకు ప్రతిబింబభూతులౌ
స్త్రీపురుషుల యోగసిద్ధిలోన
ఉత్తమాశ్రమ ప్రయోజన మొనఁగూడు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 135

అల త్రిమూర్తులాది యైన దైవతము
దివ్యయోగపథము తీర్చి మనకు
తెలియఁజెప్పరే ప్రతీకలై దానికి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 136

ఎవరిమ్రోవ వారిదే యైన బైరాగి
తనము పట్టి, రక్తి దగులఁ బెట్టు;
సతి గతించినంత శంకరుఁ డేమాయె ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 137

"జగతి కొజ్జబంతి జానకీరాముల
ధన్యమా నుదాత్త దంపతిత్వ"
మనెడి కవులమాట ననుసరించుట మేలు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 138

తమకు ప్రతినిధులుగఁ* దగుసంతు గని, ప్రజా
తంతు వెడలకుండ దంపతు లిల
సంఘసేవ సలుప, సఫలత గను జన్మ !
విశ్వహిత చరిత్ర వినర, మిత్ర ! 139

ధర్మబద్ధమైన దాంపత్యము పవిత్ర
జనకభావముగను సాఁగి, రాగ
రసము, వత్సలత్వరసముఁ గ్రోలఁగఁ జేయు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 140

సేవ లందుకొనఁగ శ్రీశుఁ డొసంగిన
దైవమూర్తు లనఁగఁ దనకు సంతు;
వారిఁ గొలిచి సిద్ధి వడయు గార్హస్థ్యంబు!
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర ! 141

* తగు = మితము, హితము అయిన

భార్య, చెడ్డదైన పాడౌను భవనంబు;
దుడుకు కొడుకువలన చెడు కులంబు;
అన్నిటికిని హాని యజమానుఁడే చెడ్డ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 142

వనిత

లక్ష్మివోలె సర్వలక్షణ యుక్తయు,
వాణివోలె జ్ఞానవతి, భవాని
వలె సమర్థయైన వనిత సార్థకజన్మ,
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 143

గడన గల మగండు, కడగండ్లు లేనట్టి
కాపురంబు, సంతు, కలిమి గలుగు
చాన జీవితంబు శాంతి సౌఖ్య యుతంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 144

పురుషు నాత్మలోన పొరపొచ్చెములు లేక,
పాల నీరు గలియు భంగి నిముడు
భార్య దొరకు టెన్న బహుపుణ్య ఫలమురా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 145

బోటి కాల ముల్లు నాటిన తనగుండె
కొట్టు దింపినట్లు కుందుమగఁడు,
దొరకు నెట్లు సతికి, తొలినోములనె కాక!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 146

పాన్పుమీఁద చోటు భార్యకిత్తురు పెక్కు
రెడఁద చోటొసంగు నెవఁడో సుకృతి;
మగనిమది వసించు మగువ ధన్యాత్మరా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 147

యువతి చదువ నేర్చి యుద్యోగ పదవుల
మెట్టినంతఁ గలుగు చెట్ట యేమి ?
పురుషదాసి కాకపోయె నం చేస్తురు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 148

ఆఁడుపెత్తనమున అణఁగారు కొంప యన్
పొల్లుమాట నేఁడు చెల్ల దింత;
దేశమేలు వనిత తీర్పఁజాలదె యిల్లు ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! !49

శక్తి యుక్తు లేమి, సాహసాధిక మేమి,
మంచి చెడ్డ లేమి – మగువలంచు,
పురుషులంచు భేదమును జూప వెప్పుడు;
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర ! 150

పెద్ద పెద్ద పనులు దిద్ద పూరుషు లనన్,
చిన్న చిన్న పనులు స్త్రీల వనఁగ,
తరుణి లేమి అంత తక్కువ తిన్నారె !
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర ! 151

సృష్టిసూత్రగతి వినష్టమ్ము గాకుండ
స్త్రీలు, పురుషులును సృజింపఁబడిరి;
అంతమాత్ర న్యూనతాధికత్వము లున్న?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 152

అగ్నిసాక్షి పెండ్లి యాడిన యిల్లాలి
మేలిబ్రతుకు కాటిపా లొనర్చి,
అన్యకాంత మరగు నతఁడు దుర్గతి కేఁగు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 153

కట్టుకొన్న తనకు, పుట్టిన బిడ్డల
కింత కూడు, గుడ్డ యిడక డబ్బు
కూడఁబెట్టఁ జూచు కుమతి యా పతిపీడ
బ్రతుక మచ్చరాదు సతికి; మిత్ర! 154

కట్నములను లాగి కైకొన్న పెండ్లాము
మోసగించి, లాతి ముదిత మరగు
ద్రోహి కిహాపరములు దూరమౌ నిక్కంబు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 155

ప్రాణపదము గాఁగ వలచిన వల్లభుఁ
గను మొఱఁగి విటులఁ గలయు చెడిప
ఘోర నరకమందుఁ గూలుట నిక్కంబు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 156

వడ్లతోడ తట్టవలె—భార్యతో భర్త,
భర్తతోడ భార్య పాటువడిన —
అంతకంటె సౌఖ్య మమరునా స్వర్గాన?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 157

చదివి గడన సేయు ముదితలు గర్వాన
మగనిఁ నత్త, మామఁ దెగడ రాదు;
సాధ్వి లక్షణములె చానకు భూషలు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 158

పుట్టినింటిమీఁద, మెట్టిన యింటిపై
తగిన నెనరు చూపు ధర్మపత్ని ;
ఏక పక్షదృష్టి యింతి కెగ్గొనరించు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 159

పతిని దైవ మంచు భావించి మనుగడ
తీర్చి దిద్దుకొన్న తెలువ లిహము
పరము గెలిచి కీర్తి పండించుకొన్నారు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 160

సన్న్యసింపఁబోవు స్వామి కడ్డము వచ్చి
"ముక్తి తెరువు చూపి పొండ" టన్న
మగువ లెంద ఱోయి, మైత్రేయి వీడిన !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 161

## జీవిత సాధన

పట్టభద్రుఁడైన, పండితుండైనను
నిత్య మెఱుఁగవలయు నీతు లెన్నొ
విశ్వపాఠశాల విద్యార్థివై యుండి;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 162

నరునిలోని సహజ పరిపూర్ణ భావంబు
విఘ్నములను జేసి వెలయకుండె;
అర్థ సాధనముల నది వికసించురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 163

గ్రంథ పఠనమునను, ఘనుల సేవనముచే,
దేశయాత్ర చేత, దివ్య గురుల
నాశ్రయించి యోగ మభ్యసించుట చేత
శక్తి వికసనమ్ము జరుగు; మిత్ర ! 164

శైశవమున జ్ఞాన సంపాదనముచేత,
యౌవనమున సత్సుఖానుభూతి (చే)
వార్ధకమున మోక్ష వస్తు చింతమునచే
గడపి బ్రతుకు పండఁ గాంచు, మిత్ర! 165

ప్రాజ్ఞులైన వారె ప్రతికూలు రైనచో,
మౌనముగనె యుండఁ గోరు మీవు;
ప్రార్థనీయ మగునె ప్రతి మనోజ్ఞాంశంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 166

నిన్న మొన్న జరిగియున్న తప్పుల కేద
నింద నొచ్చుకొనుచు—నేఁడు, రేపు
తప్పు దొరలకుండు చొప్పున మెలఁగ నో;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 167

మంచి భావములకు మనసు పాదుగఁ జేసి,
బ్రతుకు ముండ్లు లేని బాటలోన
సాఁగి వెలుఁగ నెపుడు జతన మొనర్ప నో;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 168

అడుగుతీసి యడుగు నిడువేళ మార్గంబు
నరయురీతి, బ్రతుకునందు క్షణము
క్షణము తనుఁ బరీక్ష సల్పుకొనన్ వలె!
విశ్వహిత చరిత్ర. వినర, మిత్ర! 169

ఆత్మధర్మ పథము నణుమాత్ర మేనియుఁ
దప్పకుండ నడచు ధార్మికుండు,
ఖలులనిందలకును గంపింపఁ బని యేమి?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 170

కొద్ది యత్నమునను గొప్ప దౌ ఫలితంబు
నందుకొనఁగఁ జూచు నెందు నరుఁడు;
పోఁక కెవ్వఁ డిచ్చు పుట్టెడు ధాన్యంబు?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 171

శ్రద్ధతోడ పనులు సల్ప ప్రాల్మాలిన,
ఫలము నిన్ను జేర ప్రాలుమాలు;
చేయకుండ వంట చేపకునా కూడు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 172

కాయకష్ట మించుకయు నొనర్పక నీవు
తిండి తినెడి హక్కు నిందు సున్న;
కాన చేయఁ దగును మేనిపరిశ్రమ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 173

తిట్టువాని ప్రీతి దీవించునోరిమి,
కొట్టువాని మేలు కోరుదృష్టి
పట్టుపడ్డవాని భాగ్య మేమందురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 174

తిట్టికొట్టువాని తీవ్రత హరియించి,
మంచిమార్గమునకు మలచుబోధ
చేసి యుద్ధరింపఁ జెల్లు నుత్తములకు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 175

కూల్చు నెవఁడు తన్ను గొడ్డంట నఱుకుచు
వాని కేని నీడ వరలఁ జేయు
చెట్టునడత, తాల్మి చెప్ప నాదర్శ మరా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 176

బాధపెట్టువాని పరుషమ్ము లాడక,
మేలొనర్చుటకె శ్రమించు బుధుఁడు;
చెఱకు నమలఁబడుచు చిందదా మధురిమల్ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 177

తన్ను సిలువ వేయు దారుణాత్ములఁ గూడ
కావ వేడె "యేసు" దేవదేవు;
ఈశ్వరాంశ జనితు లిట్టులుందురు సుమీ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 178

ఉచ్చనీచభేద మున్నతి గని నంత
గోచరింపఁబోదు; కొండనెక్కి
యెన్ననౌనె క్రింది యెత్తు పల్లములను !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 179

ఉన్నతాత్ము లెప్పు డుత్తమాధములందు
పక్షపాత దృష్టి పఱుపఁబోరు;
భానుఁ డిచ్చు వెలుఁగు పాపాత్ములకుఁగూడ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 180

గొప్పవారి యండ గొనువానికి విరోధి
యేని చేయలేఁడు హాని సుంత;
గరుడి తినఁగలండె కఱకంఠుమెడ పాము !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 181

చేయఁదలచు పనిని చెప్పక మాటల
ఆచరించి చూపు నార్యుఁ డెపుడు;
చెప్పి చేయకున్న సిగ్గొందవలెఁ గదా !
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర ! 182

మాట యిచ్చి చెల్లుబాటు చేయమికంటె
మాట యీయకుంట మంచిది గద !
మాటదప్పువాని మన్నించునె జగంబు !
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర ! 183

వదఱుఁబోతు ముందు వాగ్దానములు చేసి,
వాని నిర్వహింప బ్రాలుమాలు—
ఉఱిమి యుఱిమి కురియ నొల్లని మబ్బట్లు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 184

చావు పుట్టుకలును, సంయోగ, మెడబాటు
తప్పవెట్టి పరమధార్మికులకు,
అనుభవింపవలయు నంద ఱవ్వానిని !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 185

ఇష్టజన వియోగ మెడఁద దహించుట
నిక్కమైన, వలయు నిగ్రహంబు;
పుత్రమృతి వసిష్ఠు పొగులంగఁ జేయదే !
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర ! 186

కలవనట్టిపాము కాల రాతురు గాన
పడగ విప్పి, బుసల భయము పెట్టి,
తనకు పరుల కెగ్గు దగులనీయమి లగ్గు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 187

శూలిమైన శక్తి చూపక యున్నచో
జగము గుర్తుపట్టఁ జాల దతని;
కట్ట నట్టి తేలుఁ గుమ్మరి పురుగంద్రు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 188

దేహరోగములను తీర్ప యత్నింతురు,
మనసు రోగములను మాన్పఁ గనరు;
మనసు తెవులుగొన్న మనుగడ చెడుఁగదా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 189

దుర్గుణంబు లనెడి దుష్టరోగము లెన్నొ
మనసు నంటిపట్టి మానవులను
చెఱుపఁగా చికిత్స చేయరు చిత్రంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 190

ఒడలి తెగులుగూర్చు చెడుగల్పమే కాని.
యెడఁద్దతెవులు దెచ్చు కడిఁదిముప్పు;
మనసు స్వస్థపడిన మనుజుండు దేవుఁడా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 191

మానవులను హరిసమానులుగా నెంచి
సత్కరించి సేవ సలుపువాఁడు
మోక్షమునకు తెరువు వీక్షింపఁ బని లేదు ;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 192

ఎల్ల జీవులందు నెవ్వాఁడు సమదృష్టి
నందఁగలఁడో ఈశ్వరానుభూతి;
వాఁడు ముక్తి కెవరి వేడఁగాఁ బని లేదు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 193

బ్రతుకునం దొనర్చు ప్రతిపని సిద్ధికి
దివ్యసాధనముగ తీర్చి దిద్దు
కొనునరుండు వెదుకఁ బనిలేదు ముక్తికి;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 194

అఖిల భూతకోటి నాత్మ మందిరములో
నరయఁజాలు సాధకాగ్రగణ్యుఁ
డమృత తత్త్వసిద్ధి కడవి కేఁగఁగ నేల !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 195

అష్టమూర్తి యైన ఆ పరమేశ్వరు
విశ్వకోశమందు వెదకి పట్టి,
అనుభవించువాని కఱచేతిదగు ముక్తి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 196

అణువు నణువునందు అంతర్విలీనమై
ఈశ్వరాంశ మున్న; దెఱుఁగువాఁడు,
పాల నేతి నరయు పగిది గాంచును దాని;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 197

సుఖము దుఃఖ మంచు చూడక సర్వము
నాత్మ సమము గాఁగ నరయువాని
వలపటన్న నచ్చి వలచు మోక్షశ్రీయె !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 198

సద్గుణమ్ము లనెడి చారుపుష్పములతో
పూజసేయ వలయు భువనవిభుని;
చెట్లపూల పూజ చేసిన చాలదు ;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 199

అశ్వపతియు; జనకుఁ డనుసరించినత్రోవ
నేఁటివారు నడువ నేర్చిరేని,
పూర్ణ జీవితంబు పురుషార్థములు నబ్బు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 200

మదిని పేరుకొన్న మలములఁ గడుగక,
తీర్థములను గ్రుంక సార్థకతయె !
తీర్థ సేవ తొలఁచు దేహమాలిన్యంబు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 201

యోగసేవ శుద్ధ మొనరించు చిత్తంబు;
స్నాన మెడలఁ జేయు మేనిమురికి,
సత్యనిష్ఠ వాక్కు సల్పు పవిత్రంబు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 202

పూతచరిత సాధ్వి పుణ్యాత్మ స్వర్గీయ
ప్రాజ్ఞ మా వసుంధరా కుమారి
కీ ద్వితీయ శతక మిత్తు నంకితముగ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 203

—o—

## తృతీయ శతకము

— * —

### జీవిత సాధన

అనుభవమున పండినట్టి వ్రాఁతలరుచి
వచ్చునెల్లు లేఁత వ్రాఁతలకును ?
పండుతీపి యెట్లు పచ్చికాయకు వచ్చు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 204

క్షీరములను ద్రచ్చు, చిక్కు కమ్మని వెన్న
తిలల గానుగాడఁ, గలుగు నూనె;
ప్రకృతి సమ్మథింప, పరమార్థ మబ్బురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 205

ప్రకృతికావ్య నిత్య పఠనముచే నెన్నొ
మర్మముల నెఱింగి మనుజుఁ డిట్టి
దిట్టి దనఁగరాని ఆనంద మందురా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 206

బ్రతుకు నీటిబుడగ; బ్రతుకునందు నొనర్చు
మంచిపనియె చిరము మనుజకీర్తి
నవని నిల్పి, వాని నమృతు నొనర్చురా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 207

మంచివారియందు మైత్రియు, కుమతుల
యెడ నుపేక్ష, సుఖులయెడ ముదంబు,
శోకమగ్నులందు చూపు మక్కటికంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 208

మనసు, వాక్కు, కాయ మనఃసాధనమ్ముల
కైక్య ముండ దేని, అణఁగు నరుఁడు;
త్రికరణముల శుద్ధి దివ్యత్వమూలమా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 209

ఇంద్రియంబు లెట్టు లీడ్చిన నటు లేఁగు
చెనఁటి భ్రష్టుఁ డగుట సిద్ధ మెపుడు
మెత్తరాదు నేల మొత్త వా గుఱ్ఱముల్ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 210

మంచి కొంచె మేని మహనీయఫల మిచ్చు;
చెడుగు నల్పై నరుని జెఱచు, నిజము !
అమృతబిందువట్లు, హాలాహలంబట్లు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 211

అలవిగాని పనుల నాచరింపఁ గడంగి;
శృంగభంగ మంది చెడుట చూడ
అందరాని పండ్ల కఱ్ఱు చాచుట గాదె!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 212

కలసికొనఁగ రాదు కలనైన దుష్టుల
చేటు మూఁడు దాన శిష్టునకును;
డేగగుంపుతోడ వేఁగఁ జాలునె గువ్వ ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 213

పొం దొనర్చె నేని ఘంటుకులతోడ
మంచివాఁడు తా ప్రమాదపడడె !
హంస కొంగలందు ఆదర మందునా ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 214

*కూర్మయోగ మూని కుత్సితోపద్రవ
ముతప్పుకొనఁగవలయు నుత్తముండు;
నీచు లెపుడు సుజను నిగ్రహింతురు గాన !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 215

---

*కూర్మయోగము=తాబేలు తనకు దెబ్బ తగులు ననుకొన్నపుడు కాలు సేతులు లోపలికి లాగుకొనుట.

మధురగుణము లున్న మాన్యు నెల్లరు తామె
ఆశ్రయించి ఫలము లందు చుండ్రు;
బెల్లమును దినంగఁ బిలుతుమా చీమల!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 216

జగము పొగడుఁగాక, తెగనాడుఁగాక, నీ
ధర్మపథమునుండి తలగ వలదు!
గమ్యమునకుఁ జేర, గౌరవించు జగంబె;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 217

గడచిపోయినట్టి కాలంబు మఱి రాదు,
సాగిపోవు నేటిజలము వోలె;
కాలమహిమ నెఱిఁగి కడప నౌ నునుగడ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 218

నీచువలన పనులు నెఱవేర్చుకొని, వాని
విడిచిపుచ్చవలె వివేకి యెపుడు;
విషము సంగ్రహించి విడువమా సర్పంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 219

తీపి వలతు వేని తియ్యమామిడి నాటు,
విసము గోరుదేని వేము నాటు,
వేము నాటి తీపిఁ గామింపఁ గాదురా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 220

చేసికొన్న మంచి చెడ్డ కర్మలు రెండె
మిత్ర శత్రు లౌచు మృతికి పిదప,
ఉచ్చ నీచ ఫలము లొందించు జీవికి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 221

శాంతి సౌఖ్యములను చవిచూచి జీవింప
వలయునన్న మంచిపనులె కాని,
చెడ్డకార్యములను జేబట్ట రాదురా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 222

అహింస

జగమునం దహింస సాధనముల నెల్ల
పెద్ద; ఆ వ్రతంబు ముద్దు సేయు
మనుజుఁడెన్న లోకమాన్యుఁడౌట నిజంబు!
విశ్వహిత చరిత్ర, వినర. మిత్ర! 223

చిన్ని ప్రాణికేని జీవ మీయగ లేవు,
ప్రాణములను దీయు ప్రభుత యెట్లు
నీకుఁ గల్గు తఱచి నిక్క మాలోచింప!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 224

సారమౌ నహింస, సత్యవ్రతము గాంధి
నొక మహాత్ముఁ జేసి యున్నతంపు
పదవి నిలుపవే ప్రపంచంబు కొనియాడ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 225

"చంప నడరు రిపుకు సర్పదష్టుండైన
విసము పీల్చి మేలు పొసఁగఁ జూతు"
ననుట పూర్ణపురుషుఁడౌ గాంధికే చెల్లె !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 226

తనకు కీడొనర్చు దారుణాత్ముని నేని
సాధు వెద భరించి సత్కరించు;
బాడబాగ్ని లోన భరియింపదా అబ్ధి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 227

ద్వేషమును, అసూయ తీండ్రింప విజ్ఞుల
మెచ్చుకున్న, చేయ మేలె నింద ?
బిచ్చ మిడక పైకి వేఁపిని తోలుటా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 228

కోరికలు

కోర్కె లెక్కు డైన కుదుర దాత్మకు శాంతి;
శాంతి లేక యున్న సౌఖ్య మేడ ?
కాన కోరికలను కడకుఁ ద్రోయుట లెస్స !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 229

చెదల పుర్వులట్లు చెలరేఁగు కోర్కెల
ఆత్మ నిగ్రహమున నలరుధీరు
డొక్కరుండె గెలిచి యుర్వి సుఖించురా !
విశ్వహిత చరిత్ర వినర, మిత్ర ! 230

బ్రతుకు సాఁగ, తినఁగ బట్టగట్టఁగ, ఇంట
నిలువ కొరకైన వలను గామి,
కుడువఁ, గట్ట నుండఁ గోర దోసము గాదు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 231

ఇంద్రభోగములు, మహేంద్రపదమ్ములు
వలయు నంచు నెంచువారి కోర్కు-
లాత్మశాంతిఁ జెఱచి అవనతిఁ గల్పించు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 232

మదిని బుట్టు పెక్కు మమతలు, కోరికల్
ఖేద మోదములను బాదుకొల్పి,
చవిగొనంగ నీవు శాశ్వతానందంబు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 233

అనుభవించు కొలది నధికమౌ కోరిక
ఆజ్యమునను అగ్గియట్లు; కాన
భోగతృష్ణ విడిచి పురుషార్థ పరుఁడవై
బ్రతుకునిండుపంట పడయు మిత్ర! 234

బంధకమ్ములైన పశువాంఛ లాత్మని
ఘోరనరకమందుఁ గూలఁద్రోయు;
పుణ్యవాంఛ లతనిఁ బొందించు సుగతిని;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 235

ఇనుపగొలుసుగాని, హేమశృంఖలగాని
కట్టివేయఁ జాలునట్లు, పాప
పుణ్యవాంఛలెల్ల *పూరుషు బంధించు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 236

కోరికలను విడుచు కోరిక యొక్కటే
బంధకమ్ము గాదు; బాల సాఁగ,
అదియు శూన్య మగుచు నమృతత్వ మొసఁగును;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 237

## ఆత్మశాంతి

శక్రపదవి నైన సాధింపఁగా వచ్చు;
కోట్లకొలఁది ధనము కూర్పవచ్చు;
ఆత్మశాంతి సుఖము లార్జింప కష్టంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 238

పదవు లెన్ని యున్న, భాగ్యభోగ్యములున్న,
ప్రభుత, కీర్తి, విద్య, ప్రతిభ యున్న,
ఆత్మశాంతి లేదొ, అన్నియు వ్యర్థముల్ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 239

---

* పూరుషుఁడు = జీవుఁడు,

నిగ్రహంబు, త్యాగనిగతి, వైరాగ్యంబు,
తృప్తి; కీర్తి – భోగ తృష్ణలేమి,
అభ్యసించు సుజనుఁ డాత్మశాంతిని గను!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 240

కోర్కె లెదుగుకొలఁది కూలుచుండును శాంతి,
పిండె మెరుగ పూవు ప్రిదులునట్లు;
కాన శాంతికామి కావలె నిష్కామి!
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర! 241

## తృప్తి

తనకు లేనిదాని తమి నార్జనము సేయ
పాటువడు నరుండు ప్రతి దినంబు;
ఉన్నదాన తృప్తినొందు నొకండెల!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 242

ఒరుల కష్టపెట్టకుండ, నీచాత్ముల
వేఁడకుండ, తన్ను వెతక వచ్చు
ప్రాప్తమైన దాన వడయగావలె తృప్తి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 243

ఖలుల నాశ్రయించి, కడగండ్ల పాలయి,
సజ్జనులకు బాధ సలిపి పడయు
లాభమెట్టిదైన లోభమూలమె సుమీ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 244

తృప్తివలన సుఖము తృష్ణచేత నశాంతి,
కోపమున దురంత పాపచింత,
కామమున చికాకు, గల్గు-తిండిని నిద్ర;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 245

పాపమునను ధర్మపథము, బొంకుటఁ జేసి
సత్య, మాగ్రహమున శాంత్యహింస
లదుపులేమి బుద్ధి; యణఁగారు ఖిలమ్ములై;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 246

కొఱత

కొఱతలేని బ్రతుకు కొనసాఁగ దెవరికి;
కొఱత జీవితమున గొప్పవరము;
కొఱతలేనినరుఁడు కూలు గర్వాంబుధి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 247

కొఱతలేక నరుఁడు పరిపూర్ణుఁడైనచో,
పట్టవశమె వాని బ్రహ్మకైన ,
కాన, కొఱత నజుఁడు కల్పించె సృష్టిలో!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 248

కొఱతలేక బ్రతుకు కొన్నాళ్ళు గడచిన,
ఎప్ప డేని దాని నీశ్వరుండు
కర్మగతినిబట్టి కల్పింపకుండఁడు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 249

ఇహమునందు కొఱఁత లెన్నియున్ననుగాని,
పరమ తత్త్వ దృష్టి పాదుకొన్న -
కొఱఁతలేని నిత్యపరిపూర్ణుఁ డాతఁడే!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 250

కోరికలను, కొఱఁత, *కుందు, దుర్వ్యసనాల,
తిట్టు, నోటమియును, చెట్ట మొదలు
గలుగువీని నోర్చి, మెలఁగును ధీరుండు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 251

పూర్ణసిద్ధి గన్న పుణ్యాత్ము నెప్పుడు
మోద ఖేద గర్వములు చెనకవు
అలలు లేని చెఱువునట్టు లాతఁడు వెల్గు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 252

## కో ప ము

క్షణము కోప మైన సైరింపఁగా వచ్చు,
దీర్ఘకోపమైనఁ దెచ్చు కీడు;
కోపరహిత జనుల కొనియాడ సాధ్యమా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 253

---

* కుందు=దుఃఖము, తిట్టు=నింద, చెట్ట=కీడు, ఓర్చి=ఓడించి,

ఆగ్రహాది గుణము లందఱి కెంటాను;
నిగ్రహంబు వలచు నియమశీలు;
నిగ్రహింప మనసు నిన్ను నీ వెఱుంగనౌ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 254

సర్వ జీవకోటి స్వాత్మతుల్యంబుగా
నరయునట్టి వార లరుదు జగతి-
సామ్యయోగమునకె సాధ్యమీ సాధన !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 255

మానవాళి మిత్రమండలిగా నెంచి
హితము గూర్చు సామ్యమతులు సతము
చిత్తశాంతి గలిగి యుత్తము లౌదురు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 256

ద్వేష మేరికైన దోష మాపాదించి
ఆత్మశాంతిఁ జెఱుచు, నట్టులౌట
తెలిసి తెలియకేని ద్వేషింప కెవ్వారి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 257

గర్వము

గర్వమెన్న సర్వ కార్యహాని నొనర్చు;
గర్వికీర్తి తెరువు గాంచబోదు;
గర్వ ముడుగునరుడు ఘనత వహించురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 258

ధనము, విద్య, పడుచుఁదనము, రూపు, కులంబు–
గర్వ మొదవఁ జేయు ఖలుల కిలను;
వినయశీలములు వివేకుల కవె కూర్చు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 259

సత్యదృష్టి గూర్చు సాత్వికాహంకృతి
దుష్ట గర్వ మట్లు దోషకారి
కాదు గాన, దాని నాదరింపగవచ్చు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 260

అన్ని విషయములను అందఱెఱుంగరు,
కొన్నిమాత్ర మెఱుక కొందఱికిని;
శంకరుండు దక్క సర్వజ్ఞుఁ డెవ్వఁడు ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 261

సర్వవేత్త ననుచు గర్వించు మూర్ఖుండు,
జ్ఞాని వినయ మూని సంచరించు,
అన్ని యున్న విస్తరణఁగి యుండునుగదా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 262

తెలియనట్టి దాని తెలియునట్లు నటించు
దాంభికుండు చుల్కఁదనము నందు;
కరి భుజించు వెలగ నెఱుఁగదా లోకంబు ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 263

గర్వులైనవారి గర్వాపహారణమ్ము
చేయఁజెల్లు, వారిఁ జెఱుపఁ దగదు;
గాలి చెట్ల వంచుఁగాని, త్రుంపదు సుమీ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 264

శిరము వంచు గరికఁ జెఱుపఁ బోవఁడు; తరు
వ్రజము గూల్చు తా ప్రభంజనుండు;
ఉన్నతులకు లొంగి యుండు టెంతయు మేలు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 265

చదువు

చదువు మోసగింప సాధన కారాదు;
స్వ- పర, దేశ హితము సలుపవలయు;
కత్తిపీట నగుల కంఠాలు కోయనా?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 266

చదువు చదువటంచు చత్తురీ కాలాన
సంస్కరింపలేని చదువదేల ?
చదువు వారలందు సంస్కారు లెందరో !
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర ! 267

చదువు జ్ఞానసిద్ధి, సద్గుణసంపత్తి,
కోరఁదగిన నడత కూర్పవలయు;
అట్లు చేయలేని దంత అవిద్యయే !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర!

గురువు చెడ్డ, శిష్యకోటి కబ్బదు విద్య;
శిష్యు లధము లైన చెడు ఫలంబె;
ఒదవు పూర్ణ ఫలిత ముభయు లుత్తము లైన!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 269

చదువు జన్మసిద్ధ సంస్కారముల సుంత
మార్పఁజాల దెల్ల మానవాళి,
సతము నడుచు స్వీయ సంస్కారములఁబట్టి;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 270

చదువుఁగాక నరుఁడు సర్వజ్ఞుఁడగ నైన
బుద్ధి తేటఁబట్టి పొందు తెలివి;
చెంబు నబ్ధి ముంప చిక్కెడు జల మెంత;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 271

శాస్త్రచయములోని సారాంశము లెఱింగి
విస్తరమును, పొల్లు విడువ వలయు;
హంస నీరు వదలి ఆహారింపదె పాలు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 272

చదువు జీర్ణ మైన స్వాంతంబు పండును;
తిండి జీర్ణమైన నిండు బలము;
చెఱుపు గూర్చు రెండు జీర్ణము ల్గాకున్న!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 273

శాస్త్రవృద్ధి ప్రకృతి చరిత, రహస్యాలఁ
దెలిపి జీవితమును తీర్పవలయు;
మనుజ నాశమునకు మార్గంబు కారాదు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 274

గిరుల నెక్కి, నడవిఁ దిరుగు, చొచ్చును నీట,
మంటిలోన దూరు, మింటి కెగయు—
ప్రకృతి మర్మములను పరికింప *విజ్ఞాని!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 275

## సంస్కారము

సంఘసౌఖ్యమునకు, సంస్కారములు దూర
దృష్టి గల్గువారు ద్రష్ట లగుచు,
చేయ దోషమగునె శ్రేయోభిలాషులై?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 276

సంఘమందు మార్పు సౌకర్య మొనఁగూర్ప
తప్పు; దప్పుడపు డుదార బుద్ధు
లనుమతించి దాని కాహ్వాన మిత్తురు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 277

* విజ్ఞాని = సైంటిస్టు

దేశ కాల దశలు తెచ్చెడి మార్పుల
నేవగింపఁబోల దెవ్వ రైన,
సంఘ మందు మార్పు శాంతి భద్రతలకే!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 278

సంఘసౌఖ్యమునకు సహజమౌ మార్పుల
ధిక్కరించువారు, దేశ కాల
గతుల నెఱుఁగలేని మతిహీనులే సుమా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 279

జీవహింస

ప్రాణిఁ జంపి తినెడి పటుపాపకార్యంబు
జాలిమాలి చేయు నేల నరుఁడు ?
తన్ను నొరులు చంపి తిన్న హర్షించునా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 280

పెద్దచేప కవిసి పినచేప మ్రింగుట
సృష్టిధర్మ మంచుఁ జెప్పుచుంద్రు;
జంతుధర్మ మద్ది; జను లాచరింతురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 281

విజ్ఞులైన మనుజు లజ్ఞ జంతువులట్లు
సంచరించిరేని, మంచి చెడుల
భేద మెంచి మంచి నాదరింతు రెవారు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 231

కనుమవలగ్గు పండ్లు, కూరలు, ధాన్యాలు
పాలు మొదలుగల్గు వస్తు వితతి;
జనములోటు నవ్వి జనుల కాహారమౌ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 282

బలము పెరుగు నంచు దలచి చేతనముల
జంపి తినుట శివుడు సైచు నొక్కొ!
నీవు మేక వైన, నినుఁ దిను మందువా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 283

రసపదార్థ రాశి మెసవ నౌ నరునకు;
రక్తమాంస జీవ యుక్తము లయి
తన్నుఁ బోలు ప్రాణితతుల మ్రింగఁగనౌనె!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 284

జంతుబలి

కోర్కె పండ, దేవకోటికి జీవుల
బలి నొసంగు ఘోర పాపకర్మ
మనుభవింపకుండ నగునె తత్కర్తకు?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 285

లంచమిచ్చి జనుల వంచుకోవచ్చును;
దైవతముల వంపఁ దగునె దాన?
పెంచు తల్లిఁ దండ్రి లంచగొండులు కారు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 286

ప్రాణికోటిఁ గూర్మి పాలించి పోషింత్రు,
దయకుఁ బుట్టినిండ్లు దైవతములు;
జంతు బలుల నిచ్చగింతురా యెందైన!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 287

ఆర్ద్రహృదిని నొనర్చు ప్రార్థన మొక్కటే
దేవతలఁ గరంచి ప్రోవఁజేయు;
పాలకేడ్చు బిడ్డ వదలిపెట్టునె తల్లి !
విశ్వహిత చరిత్ర, విన్నర, మిత్ర ! 288

మతము

మతముచెప్పు స్థూలమార్గాల నడచుచు
సూక్ష్మధర్మములను జూడరేమి !
గమ్యమునకుఁ జేర్పఁ గల్గునా స్థూలంబు!
విశ్వహిత చరిత్ర, విన్నర, మిత్ర ! 289

సూక్ష్మమాంతరికము, స్థూలంబు బాహ్యంబు,
సూక్ష్మధర్మ విధులె సుగతిఁ గూర్చు;
సూక్ష్మ మెఱుఁగలేక సుడివడు లోకంబు
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 290

మదిని సంస్కరించు మార్గాల నడవక,
కట్టు జుట్టు బొట్టు కట్టడలను
అనుసరించు మాత్ర నబ్బునా సంసిద్ధి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 291

ఎల్ల మానవాళి యీశ్వరసంతాన
మని యెఱింగి గూడ అజ్ఞు లగుచు,
మతముపేర జనుల మ్రందించుచున్నారు:
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 292

సత్య ధర్మ దయల సాధింపలేనట్టి
మతము మతమె ! నరసమాజమందు
ఐక్యమును ఘటించునది సత్యమతమురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 293

జాతి మత విరోధచర్యలు నశియించి,
అన్నదమ్ము లెల్ల రని తలంచి,
మహికి మంచి గూర్చు మతము సన్మతమురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 294

ఎల్ల మతములందు నిమిడిన సారంబు
సంగ్రహింప, సర్వ సమ్మతమగు
విశ్వమత మొకండు వెలసి తారక మౌను !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 295

ఎట్టి తత్త్వవేత్త లేని సమాధాన
మీయలేని ప్రశ్న లెన్నొ కలవు
అతి నిగూఢమైన ఆధ్యాత్మికజగాన;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 296

ఏ మహాంబుగాని యెల్ల ప్రశ్నములకు
ఉచితమవు జవాబు లొసంగ లేదు;
విజ్ఞు లనుభవమున నెవకి కనన్ వలె!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 298

మూ ఢ వి శ్వా స ము లు

అర్థరహితమైన ఆచారములు కొన్ని
ప్రతిమతమ్మునందు పరిఢవిల్లి
నరుల నెత్తికెక్కి నాట్యమాడుచునుండె!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 299

తరతరాలనుండి తను మనస్సుల వేళ్ళు
నాటుకొన్న గ్రుడ్డినమ్మకములు,
పొలియు నెట్లు సూక్ష్మబోధ మాత్రంబున!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 300

నష్ట మవును గ్రుడ్డి నమ్మకా లన్నియు
నిశితతర్కదృష్టి నెఱపు దేని;
సూర్యుఁడుదయ మంద సురుగవా చీఁకట్లు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 301

ఇంద్రియమ్ము లించు కెఱుఁగఁ జాలనిచోట
తర్కశక్తి కుంఠితమ్మె నిజము;
తక్కు లౌకికములఁ దర్కంబు పని సేయు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 302

త్రోసి వేయ గోరఁగ తొంటియాచారముల్
క్రొత్తవంత మేలు గూర్చు నపుడు ?
తాత దిన్న బొచ్చె తరతరా లుంతుమా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 303

చేతగా నొనర్తు నీ తృతీయశతికి
జీవితంబు లోకసేవ కిడిన
శ్రీ. చి. నాగభూషణాచార్య సుకృతిని;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 304

## చతుర్థ శతకము

### ప్ర కీ ర్ణ ము లు

బుక్కగాని, భాసు వాక్కగాని, ఆరుద్ర
గద్యమేని,* ఒకని పద్యమేని
గుణము గల్గుదానిఁ గొండాడవలయురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 305

కవికిఁ గల్గుకీర్తిఁ గని వాని కావ్యంబు
గొప్ప దంచు పొగడు గుణము నెన్న,
చెట్టుపేర కాయ చెల్లించుటగుఁ జుమీ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 306

---

* ఒకని = ఒక అనామకవి

బ్రతికినన్ని నాళ్ళు బ్రతుకు చచ్చినయట్లు,
చచ్చి బ్రతుకు కృతుల శాశ్వతముగ
జగము గుర్తుపట్టఁ జాలని సత్కవి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 307

బిచ్చమెత్తి కడుపు చిచ్చార్చుకొను కవినే
ప్రజ లుపేక్ష చేసి; వాఁడు చావ,
వాని శవము కొఱకు వాదులాడఁగ లేదె!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 308

సత్కరింపఁబోదు సర్వజ్ఞ నేనియు
బ్రతికినన్నినాళ్ళు పాడు జగము;
సభలు తీర్చి పూజ సలుపు చచ్చినయంత !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 309

చేసినట్టి కృషిని జీవించి యుండఁగా
పొగడిరేని తృప్తి పొందు కర్త;
చచ్చినతఁడు స్వీయ సత్కృతి కెటు మెచ్చు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 310

ఆశ్రయించువారి నాదరింప రొకింత,
అందరానివారి కంజలింత్రు;
పెరటిచెట్టు మందు కొఱగాదు గాఁబోలు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 311

తేఁటి సంతతులకు తేనెపానక మిచ్చి
సాకు పద్మలతను చందురుండు,
మెచ్చునంత, లోటు వచ్చునా నలినికి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 312

ఉడుతపిల్ల కేల యూరిలో వార్తలు?
పిల్లి కేల యింటి పెత్తనంబు?
పేడి కేల చెలులతోడి సల్లాపముల్?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 313

"మంచి కుక్కనైన గ్రుందింపఁ దలఁతేని,
పిచ్చిదంచు గోల పెట్టవలయు"
అనెడి పలుకు రీతి ననుసరించును కూళ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 314

నిజము కొన్ని నాళ్ళు నిద్రింపవచ్చును,
చావ దెట్టి విషమ సమయములను,
అరణియందు నగ్ని యణఁగిన చందాన;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 315

కాలు జారి పడుట తేలిక యౌఁగాని,
నిలువ ద్రొక్కుకొనఁగ నేర్పు వలయు;
మొక్క పెఱుకవచ్చు, మొలపింప సాధ్యమా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 316

ప్రాజ్ఞుఁ డొకఁడు నేర్పు పచరించునప్పుడు,
పామరాళి వెఱచు ప్రతిభ చూప;
సూర్యుఁడున్నయింట చుక్కలు దోఁచునా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 217

ప్రొద్దు నెకుట తెల్లబోవును చంద్రుండు;
స్రుక్కు శశి వెలుంగ చుక్కల గమి;
కొద్ది వారలంతె గొప్ప వారల చెంత!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 218

సౌఖ్యరాశి దుఃఖ సమ్మిశ్ర మగుఁ జుమీ!
దుఃఖరహిత సుఖము దోఁప దెందు;
ఉష్ణశక్తి యిమిడి యుండదా చన్నీట!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 219

పాపి సిలువ సేయు పనికిఁ బూను నొకండు;
పాపి నుద్ధరింప వలచు బుధుఁడు;
చెడిప నుద్ధరింపఁ దొడరఁడా క్రీస్తువు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 220

"అప్పు వడకు మేరికైన జీవితమందు"
అంచుఁ దెల్పె నా మహాత్ముఁడుండు
చిన్నికాసు ఋణము చెల్లించి మృతివేళ;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 221

స్వామికార్య పరుఁడు స్వప్రయోజనమును
తృణముగాఁ దలంచు, ధీర *పన్న
స్వసుతుఁ జంప నీదె స్వామి పుత్రునిఁ గావ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 322

గడుసుభార్యతోడ కడగండ పాలౌచు
కానఁడె "సోక్రటీసు" గురుపదమ్ము !
ప్రజ్ఞ నోర్చు జ్ఞాని ప్రతికూల శక్తుల !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 323

వయసునందు వేశ్యవాగురఁ జిక్కియు
యోగిపదము వేముఁ డొంద లేదె !
సిద్ధిఁ గూర్చు తీవ్రజిజ్ఞాస, సాధన !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 324

రామదాసు ! తులసి, రామదాసుఁడు కాఁడె !
పూతచరిత భార్య బోధవలన !
నిద్ర మేలుకొల్పు నేర్పరుల్ వలయురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 325

---

* పన్నా అనునొక రాజపుత్రస్త్రీ తన ప్రభుపుత్రుని గాపాడుటకై తన కుమారుని బలిపెట్టినది.

! తులసి=హిందీ రామాయణకర్త తులసీదాసు.

క్రూరుఁడైన శివుని గుర్తింపఁ జాలెనా,
విశ్వహితము నతఁడు విస్తరించు;
కఱకుటెఱుకు ప్రథమకావ్యకారుఁడు కాఁడె!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 326

న్యాయమార్గమందు నడచెడువానికి
జంతుజాల మేని సాయపడును;
*రాము కార్యమునకు రాలేదె కోఁతులు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 327

దుష్టమార్గగామిఁ దోఁబుట్టువైనను
విడిచిపెట్టు; నా విభీషణుండు
అగ్రజన్ము వీడి ఆశ్రయింపఁడె రాము?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 328

సరసిజంబుతోడ సహవసించియు నీట
కప్ప త్రావ లేదు కమల మధువు,
తేఁటి వచ్చి గ్రోలు తెర్వమై దానిని!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 329

పద్మవనముఁ జొచ్చి పాడొనర్చునె గాని
గజము తనియ లేదు గంధకలన;
మోటువాని కేల మొగలిపూవుల సారు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 330

* పాఠాంతరము:— ప్లవగ భల్లుకములు పని చేసె రామునకై!

పండితుండు లేనిపట్ల, పామరులేని
వెలయఁగలరు తాము విజ్ఞులట్లు;
సూర్యుఁడ స్తమింప చుక్కలు వెలుఁగవా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 331

సుదతి ధీరు నేని సాగయించునన సౌఖ్య
మినుపకచ్చడాల ఋషులె చాలు !
సుందరులను గెలుచుశుకులు కొందఱె సుమీ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! ౩౩౨

ఆపదలను దెబ్బ లనుభవించు నతండు
సంస్కరింపఁబడుచు చాల వెలుఁగు;
ఉలుల దెబ్బ లందు శిల దేవమూర్తి యగా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! ౩౩౪

కష్టములను నలిగి గట్టెక్కు నాతఁడే
చొక్కు సౌఖ్యదేవి యక్కు నెక్కి ;
మేల్మి నలిగి నగగ మెడమీఁది కెక్కదా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! ౩౩౫

పసిఁడి మంచిచెడుఁలఁ బ్రకటించు నొరగల్లు,
నరుల గుణము పసిఁడి నొఱుక పట్టు,
స్త్రీల యోగ్యతలను జెప్పును గేహంబు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! ౩౩౬

పేదవారి శ్రమల పెరుగుచు నున్నవి,
ధనికవర్గ సంపదలు కరంబు;
కలుగువారి యాటకట్టు మేల్కొన పేద!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 337

తేఁటి చంపకమును తిట్టిన, నయ్యది
పరిమళములె దిశలఁ బర్వఁ జేయు;
శిష్టు దుష్టుఁడంచు చెప్పదిట్ట చెడునొక్కొ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 338

ఆచరించునప్పు డమృత తుల్యము లయి,
అవల విషఫలంబు లందఁ జేయు
కార్యములకు నరుఁడు కడగంగరాదయా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 339

గుర్తుపట్టువారు కొఱవడినప్పుడు,
పూజ్యులేని ఘనత పొందలేరు;
మణిని గాజటంచు మందుఁ డెంచును గదా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 340

మణిని గాజటంచు, మణియంచు గాజును,
దలఁచి మోసపోవఁ గలుగు నష్టి;
నిక్కమైన తెల్వి నెఱపు శాంతి, సుఖంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 341

పూజ్యు గొప్పఁదనము పొగడ నిష్టము లేక
దోషములను మోపు ద్వేషబుద్ధి
మణిని గా జటంచు సుజనుల వంచించు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 341

పంచదార నిసుక యంచు పిల్తురు గాక
తియ్యఁదనమె యిచ్చి తృప్తి గూర్చు;
పేరు మార్చినంత, మారునా స్వగుణంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 342

స్నేహితుండు వోలె చేసిన ధర్మంబు
జీవివెంట నేఁగి శివము గూర్చు;
నాది యనిన మేను బూదిపాలై పోవు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 343

జ్ఞానతేజ మెడఁద లోన నిండారెనా,
పుస్తకములు చదువఁ బూన నేల ?
పట్టపగలు దివ్వె పెట్టఁగాఁ బని యేమి ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 344

ప్రొద్దు పొడిచి వెలుఁగు పొడసూపకుండిన,
వేలు దివ్వె లేని వెలుఁగుఁగాక,
కటికి చీఁకటులను కబళింపఁ జాలునా ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 345

ధాన్యరాశి దంచి, తండులాల్ గ్రహియించి,
చిట్టు, పొట్టు - వదలి పెట్టినట్లు,
సారముం గ్రహించి సారహీనము విడు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 346

గజశరీర మెంత ! కంఠీరవం బెంత !
సింగ మెగిరి వ్రేస్తు శిరము వ్రచ్చు;
వజ్ర మల్ప మైన వ్రక్కలింపదె కొండ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 347

పూలగుండెలందు పొంగారు తేనియ
కడుపునిండఁ ద్రావి క్రాలు తేఁటి,
పూలమీఁది మంచుబొట్లు గ్రసించునా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 348

సుప్రసన్నముఖము, సుమధురమగు వాణి,
విమలదృష్టి, స్నేహవృత్తి, కరుణ
సంభ్రమమునఁ జూచి స్వాగత మొసగుట
సుజన లక్షణములు సువ్వె మిత్ర ! 349

నీవు ముందుకేగు తోవయే జీవించు
టనగ, కాన చేయు మవిరళకృషి !
మాంద్య మన్నదాని, మరణంబునేనియు
గెలిచి సిద్ధిఁ బొందఁ దలపు మిత్ర ! 350

తెల్లఁబడినజుట్టు తెల్పు వృద్ధుండని,
ఎడఁద పండె నంచు నుడువలేదు;
ముసలితనము చూచి మోసపోవఁగ రాదు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 351

కంటకముల నేని ఖలజనంబుల నేని
దూరముగనె ఉంచ దోసఁగు రాదు;
ముండ్లు గ్రుచ్చుకొనును, ముప్పు గూర్తురు ఖలుల్
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 352

తీయనైన నీరు తెగవాడుకొను జనుల్
బావి యెండి వట్టిపోవుదాఁక
దాని విలువఁ దెలియగానోప రేమందు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 353

కులమొకండె మనుజకులమందురు దానిని,
భాష లెన్నియైన భావ మొకటె !
మత మొకండె, ఆత్మమత మగు నయ్యది !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 354

పూర్ణసిద్ధి నంద బుద్ధిఁ దలంతేని
అనుభవించు బ్రతుకు ననుదినంబు-
నవ్యజీవనంపు నాంది కాఁగలయట్లు
బ్రతుకు తీర్చుకొనుచు ప్రబలి, మిత్ర ! 355

చెప్పఁదగినవాటిఁ జెప్పి మెప్పింప నౌ
చెప్ప రానివాటిఁ జెప్పి నొప్పి
కలుగఁ జేయఁగూడ దిల నెవ్వ రేనియు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 356

అప్రియముల నైన అతినమ్రమగు రీతిమై
అఁచి తూఁచి నొప్పి అంటకుండ
చెప్పఁగలుగు-గొప్ప మెప్పు ఘటించురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 357

ప్రీతి విషయములను భావమందు నిమిడ్చి
క్రొత్తవాని నెఱిఁగికొనుచు నూత్న
సృష్టి చేయు గొప్ప శిష్టులౌ కవులకు
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 358

తన్ను పొగడికొని లితరులను దెగడుట-
కుజన లక్షణంబు; సుజను తీర్వ-
తనదు గొప్ప చెప్పికొన కొక్కఁ బొగడుట !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 359

నరుఁడె గొప్పవాఁడు నరలోక జీవుల,
నరునియందు గొప్ప దరయ మనసు,
మనసు మార్చు నరుని మహనీయమూర్తిగా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 360

*గతిని పెంచుకంటె మతి పెంచుమార్గంబు,
జడత వీడి మృడత పడయుత్రోవ,
మదము ప్రిదిలి హృదయ మెదిగెడి నడవడి
పడయుదేని బ్రతుకు పండు మిత్ర ! 361

ఒరులఁగలసియుండు, మొరులకై జీవింపు;
మొరులహితము చేయుచుండు మెపుడు;
స్వార్థమునకు బ్రతుక సాధులక్షణ మౌనె !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 362

హస్త కౌశలమున అఖిల ప్రజాళికి
కొంద ఉపకరించుచుండు రెపుడు;
కట్టుకథలు చెప్పి పొట్టపోసికొనుచు
కొంద ఉందు రవనియందు; మిత్ర ! 363

ఆరుగాల మొడలు ధారవోసినఁ గాని
పిడుచ నోటఁ బడని పేద లుండ
సోమరులకు నెల్ల సుఖములు చేకూర్చు
భరతభువిని బ్రతుకు బరువు; మిత్ర ! 364

సృష్టి చేసి యిచ్చు శిల్పీశ్వరుఁ-శివ
కేశవాది మూర్తిరాశి ప్రతిభ !
పూజ చేసి బ్రతుకు పూజారి వానిని;
శిల్పి తిండి లేక చివుకు; మిత్ర ! 365

---

* గతి = జీవనోపాధి. మృడత = శివత్వము. ప్రిదిలి=నశించి.

శిల్పి విగ్రహాదుల సృష్టించి కోవెలన్
సంప్రతిష్ఠ చేసి స్వామి *కిడఁగ
అపుడు పూజరికిని అర్చించు నధికార
మబ్బు పూర్వ నియమ మరయ మిత్ర ! 866

అట్టి సృష్టికర్త నాదిమ బ్రహ్మను
గర్భగుడికి దూరుగా నొనర్చి
చిన్నచూపు చూడ శిల్పులేల హర్షింతు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 867

పట్టు నింపునట్టి పుణ్యాత్మ కర్షకు
తనకు వలువ లొసగు తంతువాయి
సర్వవస్తువులను సమకూర్చు శిల్పిని
కీడుపఱుప చేటు మూడు మిత్ర ! 868

తాను సంకరుండు, తన యొజ్జ సద్బ్రహ్మ
వంశజుండు, గురుల వంగడంబు
తిట్టునట్టి మూర్ఖుఁడెట్టి గురుద్రోహి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 869

గెలుపు లంది ఉబ్బి కులికెదు నట్టులే
ఓటములను గల్గు లోటు గూడ
అనుభవించువపుడె అగు నిండుబ్రతు కెన్న !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 870

* స్వామి = ఆలయమును నిర్మింపజేసిన యజమానుడు.

ఎండమావులందు నేముండు నీరముల్ !
వంజఁ బిదుక పాలు వచ్చు నొక్కొ !
షండునందు పురుష సామర్థ్య ముండునా ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 371

నేలమీఁద పడవ, నీటిమీదను బండి
నడపఁ జూడ సిద్ధి పడయఁ గలఁడె ?
తగిన సాధనముల నగు పని సాధింప !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 372

స్వీయధనము ఖర్చు చేయనొల్లని లోభి
కంటె పరుల ధనము కావలె నను
పరమమూర్ఖుఁ డధికపాపిష్ఠతము డఁరా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 373

అత్తవారియింటి అల్లుండ్ర మని వారి
రక్త మాంసములను త్రావి తినుచు
పొట్టఁ బెనుప జూచుమూర్ఖ జామాత లీ
నవయుగమున నుంట నాన మిత్ర ! 374

ఆత్మహత్యతోడ అన్ని కష్టంబులు
తీరు నన్న తలఁపు తెలివి లేమి !
చచ్చి మనుజుడేమి సాధింప గలఁడురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 375

మంచిపను లొనర్ప మంచిసాధనముల
నెంచి పూనుటొప్పు నెల్లరకును;
అలఁ జంపి వాటి తోలుతో చెప్పులు
చేసి దాన మిడుట చెట్ట మిత్ర ! 376

దొంగపనుల డబ్బు దోఁచి సత్కార్యముల్
వేనవేలు చేయుదానికంటె
ధర్మమున గడించు ధనమున దోషముల్
లేని బ్రతుకు ద్రోయఁ బూను మిత్ర ! 377

కాకిమూఁకఁ జంపి గ్రద్దల కాహార
మిడుట దోష మంచు నేల చెప్ప ?
అంతరాత్మ పలుకదా ఆలకించిన !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 378

పాప మేల చేయ, పరిహారముల కేల
పాటువడఁగ ? బురదఁ బడఁగనేల ?
కడుగనేల మేను ? కడులోభమునఁ గాక !
విశ్వహిత చరిత్ర,వినర, మిత్ర ! 379

చెప్పఁ దరమె నేడు చీఁకటిమార్కెట్టు
వారు చేయు ద్రోహ దారుణములు ?
పరుల దోచుఁ డబ్బు హరుఁ డిచ్చగించునా ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 380

ఉంఛవృత్తి సక్తు వొక్కింత సమకూర్చి
దానమీన ధర్మ తనియఁ జేసి
పరమపదము గనిన భక్తు *నెఱుంగవా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! ౩౮౧

తగవు వీడి నల్లధనము కోట్లార్జించి
గుడులు గోపురముల కిడుటకంటె,
ధర్మమున గడించు దమ్మిడీ యైనను
కూటిపేద కిడుట గొప్ప మిత్ర! ౩౮౨

కూడు గుడ్డ లేక, "కొంప గోడి"యు లేక
అలమటించువారి నరయకుండ
తనకు గుళ్ళు గట్ట తనియునా శ్రీహరి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! ౩౮౩

"భారతమున నెల్ల ప్రజలు మాత్రమె కాదు
ఒక్క కుక్క యేని మెక్కకుండ,
నుండునంతవఱకు నుండను శాంతిగా" ౩౮౪
అను నరేంద్రు పలుకు వినవె! మిత్ర!

దేవతలకు ప్రతిగ దివ్య గురూత్తముల్
కోవెలలకు ప్రతిగ భావిఁ దీర్పు
వివిధ విషయ భరిత విద్యాలయంబులు
వృద్ధి నంద మేలు పృథ్వి మిత్ర! ౩౮౫

* భారతములోని సక్తుప్రస్థుడు.

ఎదుట నెంతొ పొగడి యేపాటి చాటైన
నింద సేయు దుష్ట నీచమూకలు
గ్రామముల వసించు గోముఖవ్యాఘ్రముల్ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! ౩౮౬

పనులు తీరువఱకు ప్రార్థించి అవి తీర,
ఉపకరించినట్టి ఉత్తములను
తలఁపనట్టి పటుకృతఘ్ను లుందురు జగాన;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! ౩౮౭

గాలి ప్రతిఫలంబు కాంక్షింపకే వీచు;
ఇచ్చు పండ్లు నట్లె వృక్షచయము;
సజ్జనాళి అట్లె సాహాయ్య మొనరింత్రు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! ౩౮౮

ఊరి పెద్దయన్న ఊరెల్ల వణకును;
పెండ్లమన్న నూరి పెద్ద వణకు,
పెద్దఊరికైన, పెండ్లాని కగునొకా—!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! ౩౮౯

షడ్రసములతోడి సాత్వికాహారంబు
దేహబలము, బుద్ధి, తేజ మొసఁగు;
ఒండు రెండు రుచుల నుండ దారోగ్యంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! ౩౯౦

కాయలున్న చెట్టు కాపలా కోరును,
జ్ఞానధనుఁడు నియమ చయముఁ గోరు,
ద్రవ్యవంతుఁ డాత్మరక్షణ గోరును;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 391

బ్రతుకువెంట నంటి బడలక పర్వెత్తఁ
జాలునట్టి దొక్క-చావు సూవె!
బ్రతుకు సార్థకమగు పని చేసి చావరా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 392

చావుమహిమ నెఱుఁగఁ జాలెడు వానికే
బ్రతుకువిలువ తెలియఁబడు నిజముగ
బ్రతుకులోని చివరి భాగమేరా చావు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 393

బ్రతుకవచ్చు నరుఁడు పదివదులేండ్లైన
ఎన్నినాళ్ళు బ్రతికి యున్నఁగాని,
బ్రతుకునందు చేయఁబడు ఘనకార్యమే
నరునిగొప్ప చెప్పు; పరమ మిత్ర ! 394

ఆశపడుదు లోక మన్యాయములు లేక
ధర్మరాజ్యమై ముదంబు గనఁగ;
అట్టికాల మెప్పుడైనను గాంచితే !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 395

శిష్టశక్తులకును దుష్టశక్తులకును
సంగరంబు ప్రకృతి సమ్మతంబు;
అగుట నిట్టియాశ అడియాసయే సుమీ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 396

అరులు పొగడుచున్న దపురూప మవుటచే
మిత్రవరుల వేల మెప్పులైన
సాటిరావు వైరి సాధు వాదమునకు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 397

ఎన్ని చూపు గురువి కున్నదోషము లేని!
కొసరి పొగడు పగతు గుణము లేని!
పక్షపాత రహిత భావనాశాలివై;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 398

మోమునెదుట చేయుపొగడికల్ నిక్కము
లనుచు మోసపోకు మజ్ఞుడ వయి;
చాటుగా నొనర్చు సంస్తుతినిందలే
నీదురూపు దెలుపు నిజము; మిత్ర! 399

బుద్ధిలోని సుగుణములను, దోషంబుల
నంతరాత్మ చెప్పు నడుగు దేని,
పరులు చెప్పకంటె పరమసత్యంబుగా;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 400

నీవు విన్న దెల్ల నిజమని నమ్మకు
కల్లలను వచింతురు ఖలజనములు;
చిరవిమర్శ సత్య మరసిన పిమ్మటే,
విశ్వసింపవలె వివేకి; మిత్ర! 401

అర్థమునకుముం దపార్థ మూహించుటే
బహుజనముల కుండు సహజగుణము;
నూటి కొకడు దప్ప, పాటింపలే రొరు
లెట్టు లున్నదాని నట్టు మిత్ర! 402

కంటియద్దములకు గల రంగురీతినే
వస్తువితతి దోఁచుపగిది తనదు
మదికి దగినట్టే సమస్తమ్ము దోచురా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 403

వయసు ననుసరించి వర్ధిల్లుచుండును
కోర్కు లెన్నొ యెడఁద గూడుకట్టి
ప్రాయమునుగ కీర్తిపై ఆస సయితము
పెఁగిపోవుచుండు; వినర మిత్ర! 404

కోరుకొనగ వలయు కొందఱితో మైత్రి
లాభపడగ నెదఁ దలంతు మేని;
కోరుకొనగ వలయు కొందఱితో పగ
హృదయ శాంతి వలతు మేని; మిత్ర! 405

నాయకుని నొసస్తు నాల్గవశతి శార్ద్రి
చిత్తు, సచ్ఛరీరు, చిత్రశిల్పి,
సత్కళా తపస్వి, సంజీవదేవుని;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 406

# పంచమ శతకము

## పారమార్థికములు

### ఈశ్వరుఁడు

వ్యావహారికముల వచియించి యిట్టుల
పారమార్థికములఁ బలుకుచుంటి
భవవిముక్తి నొసఁగు పరమార్థచింతన !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 407

సృష్టి యుండుదనుక సృష్టికర్త యొకండు
ఈశ్వరాఖ్యచేత నెసఁగుచుండు;
సృష్టి లేద యేని శేషించు బ్రహ్మమే !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 408

నువ్వులందు నున్న నూనెచందంబున
విశ్వమందు వెలయు నీశ్వరుండు;
చూడ చేతఁగాక లేదన్న నేమాయె !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 409

స్థూలనేత్రములకుఁ దోఁపని దేవుండు
జ్ఞాన నేత్రమునకుఁ గాన వచ్చు ;
దుర్భిణులకు పగటఁ దోఁపదా గ్రహరాశి !
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర ! 410

కంటి కగ్గపడక కల వెన్నొ యనుభూతు
లట్టి వెల్ల సున్న యనుట తగునె !
ఘ్రాణ మనుభవింతు, పట్టి చూపుదె దాని !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 411

ఈశుఁ జూచు టన్న, వాసనచూచుట
వంటిదంచు నెఱుఁగవలయు నరుఁడు;
కన్ను చూడలేదు గద వాసన నొకింత !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 412

వాసనలను జూడ వలఁతి ముక్కయినట్టు,
లీశుఁ జూడ పూత హృదయ మొకటె
వలఁతి యంచు యోగివర్యుల కెఱుకరా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 413

కనులు లేక చూచు, విను కర్ణములు లేక,
అవయవములు లేక అన్ని పనులు
చేయు నీశ్వరుండు; చిత్ర మాతని స్థితి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 414

సాధనములు లేక, సాధింప కార్యంబు
లెవని కగునో వాఁడె ఈశ్వరుండు;
చోద్యమతని మహిమ చూడ, నాలోచింప
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 415

కాఁడు పురుషుఁ డతఁడు, కాఁడు నపుంసకుం,
డంగనయును గాదు; లింగలతకు
నాళి కందనట్టి యద్భుతశక్తి సూ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 416

భాష లింగ వచన బహువిభక్తుల నొప్పు;
పలుకఁ జాలు నెట్లు బ్రహ్మము నది?
మదికి మాట కందనిది గదా తత్త్వంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 417

విశ్వయంత్ర మాత్మవిధి తప్పకుండంగ
తిరుగ నొక అమేయ దివ్యశక్తి
వెలయు, దేవుఁ డంచు పలికి రద్దానినే!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 418

ఎవని నెఱిఁగి నంత నేను, నీవును, పరు
లెల్ల జీవకోటి యేక మగునో
అట్టివాఁడె దేవుఁ డగు తత్త్వ దృష్టిని
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 419

దేని నెఱిఁగి నంత నేను నీవును పరు
లెల్ల వస్తుకోటి యేకమ యగు,
నట్టి పరమతత్త్వ మగు పరబ్రహ్మంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 420

నామ రూప కార్య నటనల కందక,
విశ్వనాటకంబు వెలయ, చిత్ర
సూత్రధారుఁ డగును జువ్వె తా బ్రహ్మంబు
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 421

ఎవనిశక్తి యెన్నఁడేని లుప్తము కాక,
జ్యోతియై వెలుఁగుచు జ్యోతు లెల్ల
వెలుఁగఁజేయు నతఁడె విశ్వకర్మాభిఖ్య
వెలయు నీశ్వరునిగఁ దెలియు; మిత్ర ! 422

అఖిల విశ్వసృష్టి కాధార భూతమై
దివ్యశక్తి యొకటి తేజరిల్లు,
చిత్తరువుల వెలయఁజేసెడి తెరవోలె !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 423

భూత భౌతికములఁ బొందక, అవ్వాని
లోన, వెలిని—నిండి జ్ఞానరమ్య
మైవచింపరాని దగు పరబ్రహ్మంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 424

శుక్రమండలంబు శోధింపగా వచ్చు,
కుజునిగూర్చి తెలిసికొనఁగ వచ్చు;
ఆత్మతత్త్వ మెరుఁగు టరిది విజ్ఞుల కేని!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 425

కలదు లేదటంచు పలువాదములు మూల
తత్త్వమును గురించి తారసిల్లె;
ఆత్మరూపమైన దమృత మెట్లగు నొక్కఁ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 426

సర్వశక్తి యెవఁడొ, సర్వజ్ఞుఁ డెవ్వఁడో,
నిత్యతృప్తుఁ డెవఁడొ, నిత్యుఁ డెవఁడొ,
ఎవఁ డనంతశక్తి, యెవఁడు సర్వేశ్వరుం
డతఁడె ఈశ్వరాఖ్యుఁ డగును మిత్ర! 427

ఆత్మభావ మంది, అమృతులౌ యోగుల
వర్తనములు, దివ్యవాక్కు లరసి,
ఊహ సేయు బ్రహ్మ మున్నది లేనిది;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 428

లేనిదాని గూర్చి లేదని చెప్పక,
ఉన్న, దంచు మనుచు నొత్తి చెప్పి,
వంచనం బొనర్త్రి పరమార్థ వేత్తలు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 429

విస్తరించుచున్న విజ్ఞాన శాస్త్రంబు
మూలతత్త్వ మర్మమును వచించి
సందియములఁ దీర్పఁ జాలిన మేలవు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 430

పూర్వతత్త్వవేత్తఁ బూజించు జగమిప్డు;
కొలుచు నపుడు భువికి కొత్తవెలుఁగు-
దారిచూపు నవ్య తత్త్వోపదేశిను;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 431

లేదటన్నమాత్ర లేకుండఁ బోఁబోవ
దున్నవస్తు వుండు నున్నయట్లె;
ఉన్న దన్న లేమి కునికి సిద్ధింపదు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 432

"దేవుఁ డెక్కడ"ంచు తిరుగఁగాఁ బనియేమి !
సర్వభూత హృదయ పద్మములను,
ఈశ్వరుండు లేఁడె ఈక్షింపఁ జాలిన !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 433

హృదయనిష్ఠుఁడైన ఈశ్వరుఁ గనలేక,
తిరుగు చుందు రెల్ల తీర్థములకు;
చేత కొఱవిఁ బూని చిచ్చు వెదకినట్లు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 434

తత్త్వసాధనమున తనువులో పరమాత్మ
నరయవచ్చు ధీరుఁడైనవాఁడు;
ఆత్మదర్శనమ్ము నందక సుఖ మేడ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 435

బొంది నీశుఁడున్న చందంబు తెలుపఁగా
కలశ, తాలు వెట్టి కట్టినట్టి
గుడిని దైవమూర్తిఁ గూర్చిరి మనవారు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 436

సాధకుం డొనర్చు సాకార పూజన
లంతరాత్మఁ గనుట కైన మెట్లు;
సిద్ధి యొదవినంత శివపూజ లేలరా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 437

దైవతములపేర "తంత్రాలు" పన్నుచు
కలి నమాయకులను వలల వైచి,
పొట్ట పోసికొనెడి పుణ్యాత్ము లుందురు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 438

దేవుఁ డన్న జంకు దేశాన మోసాల
కేమి కొఱఁత జనుల నిచ్చకొలఁది
దోఁచుకొనఁగ వచ్చు దుస్తంత్రములు పన్ని;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 439

శాస్త్రజాల మెల్లఁ జర్చించి వేత్తలు
సృష్టి మూలశక్తిఁ జెప్పుచున్న,
గుడ్డివాండ్రు గజముఁ గూర్చి చెప్పుట యగు
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 440

ఆనందము

ఆత్మలోన వెలుఁగు నానందమున పాలు
పంచుకొనియె సర్వ వస్తుకోటి
అలరు చుండు జగతి నానంద మయముగా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 441

ఆత్మ వెలుఁగు లోక కానంద మయమౌట
జగతి దేని కేని సాధ్య పడదు;
బెల్లి మిఁడక తీపి పిండి కబ్బదు గదా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 442

అఖిల జగము నరున కానంద మగుటకు
హేతు వాత్మ దాన నిమిడి యుంట,
పాల రుచికి వెన్న మూలమైనట్టుల;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 443

సర్వ జీవులకును సహజ మానందంబు
దుఃఖ వికృతి యెపుడొ తోఁచి, పోవు;
సహజ సిద్ధ మేదొ, స్వస్వరూపంబదే !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 444

ఎడఁద నాశ్రయించి పొడము నానందంబు,
వెలిజగంబునందు వెలయు నంచు—
భ్రాంతిఁదలఁచి నరుఁడు భంగమందుచునుండు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 445

ఆత్మనిష్ఠ మైన ఆనందము వెలార్చ
బాహ్యజగము తోఁడుపడఁగ వచ్చు;
కాని బాహ్యవస్తుగతము గా దది సుంత !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 446

బాహ్య విషయరాశి ప్రతికూల మనుకూల
మైన యపుడు దుఃఖ హర్షములను
అందుచుండు చిత్త; మవి లేవు వెలుపల;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 447

ప్రకృతి శక్తులెల్ల వశమైన, సుఖమును
పడయలేఁడు, మనసు వశము గాక;
ఆత్మనిష్ఠ సౌఖ్య మాత్మ గెల్వక రాదు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 448

### ఆస్తికత — నాస్తికత

జడమునుండి పుట్టు చైతన్య మనియును,
జడము వేఱు, జ్ఞానశక్తి వేఱు,
అనియు రెండుమతము లలరు నీలోకాన;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 449

కాష్ఠమందు నగ్నికరణి చైతన్యంబు
జడవిలీనమై సుసమయమునను
వ్యక్తమౌనటంచు వచియింత్రు కొందఱు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 450

జడముకన్న వేఱె చైతన్య మను సత్త
కల దటన్న, ఆస్తికత చెలంగు;
జడమె మూలమన్న సాగు నాస్తిక్యంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 451

జడమునుండి పుట్టు చైతన్య మన్నచో,
ఆత్మశాశ్వతత్వ మణఁగి పోవు;
పాపపుణ్య భేద పరిపాటి నశియించు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 452

పుట్టునట్టి దెపుడు గిట్టక తప్పదు,
గిట్టునట్టి దగ్గై పుట్టుచుండు;
జన్మమృత్యుదశలు శాశ్వతాత్మకు లేవు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 453

ఆత్మశాశ్వతత్వ మంగీకరించిన
జన్మ కర్మ గతులు సంభవించి,
మోక్షసాధనములు మొదలగు యోగముల్;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 454

హరిహరాది నిఖిల సురల కాధారమై
తనరు నిర్వికార తత్త్వ మొకటి;
నగలరూపు దాల్చెదగిన బంగరు వోలె !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 455

నగలు, పెక్కులైన నామరూపములతో
నొప్పుచున్న, బంగరొక్కటె కద !
పరమతత్త్వ మొకటె; పలు నామరూపముల్ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 456

హేమకాంక్షి నగల కెట్టి విల్వయు నీక
బంగరువునె కోరు భంగి, జ్ఞాని
దైవతముల మూల తత్త్వ మారాధించు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 457

జల మొకండె, బుడగ, లలలు, నుర్వులు, నుడుల్
గాఁగఁ దోఁచునట్లఖండ మైన
బ్రహ్మ మొకటె తోఁచు బహురూప విశ్వమై!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 458

ఆస్తికుండవైన నాస్తికుఁడవె యైన
బాధ లేదు, పెద్దబాటఁ జనక
కడఁగితేని లోక కల్యాణమునకునై !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 459

ఆస్తికుండ నంచు, అవినీతిపరుఁడయి
ఘోరముల నొనర్చు కూళకంటె,
నాస్తికుండె మేలు నయశాలి యైనచో !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 460

అందరానిదాని "అస్తి, నాస్తి" యటన్న
లోటు లేదు మాకు; లోకమునకు,
నిత్యమవసరములు* నీత్యవినీతులు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 461

తల్లిఁ, దండ్రి, గురుల ధర్మస్వరూపుల
పూజ చేసినట్లె, భువన జనకు
నర్చ చేసి ధన్యు లగుదు రాస్తికు లెల్ల!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 462

దైవభక్తి యున్న తరియించు నాతండె;
మంచి నడతచే సమాజమునకు
మేలు గాన, నడత మించును దైవమ్ము!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 463

---

* నీతి ఆచరించుటకును, అవినీతి వదలిపెట్టుటకును తెలియ దగినవగు చున్నవి.

## అదృష్టము

కన్ను మొదలుగాఁగఁ గలయింద్రియములకు
గోచరించు వస్తుకోటి దృష్ట,
మందకుండ వాని కలరున దేమగు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 464

తిట్ట నేల నేఁ డదృష్ట మన్నంతనే
ఇంద్రియముల కించు కెఱుక పడక,
తేజరిల్లునది అదృష్టము కా కేమి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 465

మనసుకందు సర్వమును దృష్టమే యగుఁ
బుద్ధి కందు కొనఁగఁ బోలనట్టి
విషయ జాతమెల్ల వెలయు నదృష్టమై;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 466

వస్తువందు నిమిడి వర్తిల్లు ఘన శక్తి
దృష్ట మగునె యెట్టి ధీనిధులకు ?
అగుట నది అదృష్ట మను పేరఁ బరగదా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 467

దృష్ట మైంద్రియక మదృష్టం బతీంద్రియ
మైన తత్త్వ, మాత్మ అదియె గాన,
ఆత్మదర్శనమున అమృతుఁడౌ మనుజుండు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 468

హేతువాద మిప్పు డెఱకలు దాలిచి,
తిరుగుచుంట కీ యదృష్టవాద
మొకటె మూలహేతు వూహించి చూడ రా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 439

## కర్మము

కర్మ మన్న దెపుడు ఘనశక్తియుక్తమై
ఉచితఫల మొసంగు చుంట నిజము;
ఇట్టిశక్తినే అదృష్టమం చాడిరి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 470

కర్మములు ఫలంబు గల్పింపక నశించు
నంచుఁ జెప్పువాని నాస్తికుఁడని
యెన్నె బుద్ధదేవుఁడేనాఁడొ; నిజ మది!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 471

కర్మమం చదృష్టగతి యంచు వాకొని,
మూఢులైన వారి మోసగించి,
అణఁగఁద్రొక్కుఁబోల దభివృద్ధిఁ గననీక;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 472

కడు విచిత్రమైన కర్మ విధానము
లెవరి కెట్లు పండి, యెప్పు డెట్టి
సిద్ధి గూర్చునో వచింప శక్యము గాదు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 473

ఏది కర్మఫలమొ, ఏది యదృష్టమో
తెలిసికొనుట యంత తేలికగునె!
తోఁచినట్లు పలుకుచుందురుకు జగంబు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 474

గహనమైన కర్మగతి నెఱుంగుటకు; స
ర్వేశ్వరునకు, సంయమీశ్వరునకు
తక్క, పరుల కగునె తల గొట్టుకొన్నను !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 475

యోగ నిశితబుద్ధి కొక్కనికే చెల్లు
కర్మగతి నెఱుంగు గౌరవంబు;
చింత సేయవలయు చిర మాతఁడును హృది!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 476

కర్మబద్ధజీవి క్రమయత్న మొనరించి
అధికతర ఫలంబు లందవచ్చు;
యత్నపరుఁడుగాక *యర్థసిద్ధి హుళక్కి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 477

"పుట్టె డామువమునఁ బొరలిన నైనను
అంటునంతె అంట్లు" నన్నయట్లు,
జతనపడిన ఫలము సమకూర దొకనికిఁ
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 478

---

* అర్థము = ప్రయోజనము, ఫలము.

కాన బ్రహ్మరూపకర్మ కంజలి పెట్టి,
యుక్తమైన కర్మయోగ మూని,
జీవితమ్ము గడుపఁజెల్లు నుత్తమునికి;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 479

ఆచరించుపని అహంకారవశమున
కర్మ మనఁగఁబడు; అకర్మ మగును
ఆచరించునది అహంకారమును వీడి ;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 480

నేను నే నటన్న జ్ఞానమే శుద్ధాత్మ;
అదియు ఇదియు నే నటన్న తెలివి
నరయువలయు సూ! అహంకారమును గాఁగ;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 481

## పునర్జన్మ

హేతువాద దృష్టి నెంచ పునర్జన్మ
లే దనంగ వీలు కాదు; దేహి
మేనితోడ తాను మృతి నొందినని తప్పు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 482

కర్మ జన్మమునకు కారణ మాటచే
ప్రాగ్భవంబు లేక ప్రకృత జన్మ
మబ్బెనన్న వచ్చు వికృతా[illegible];
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 483

ఉండఁబోవ దన్న నుత్తరజన్మంబు
నేఁటి జన్మమందు నెఱపుకర్మ
నష్టమై కృతప్రణాశదోషము వచ్చు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 484

ప్రాణి నిత్యుఁడంచుఁ బలికి, పునర్జన్మ
లే దటనెడివారి వాద మరయ
పాపి నరకమందె పరితపింపఁగవలె;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 485

పాపినైన జన్మ పారంపరీలబ్ధ
పుణ్యమున విముక్తిఁ బొందఁ గాన
శాస్త్ర హేతు హితము జన్మాంతరస్థితి;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 485

అనిబిసెంటు, మతము లన్నింటి శోధించి,
చర్చ చేసి చిరము, సారమేర్చి,
చాటలేదె నిజము, జన్మాంతరముగూర్చి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 487

కుండలినీశక్తి

మనుజునందు నున్నఘనశక్తి నూఱింట
నాల్గుపాళ్ళె జగతి నాట్యమాడు ;
అన్నిపాళ్ళు వెలుఁగ నతఁడు దేవుండగు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 488

నిదురపోవుశక్తి నెదతట్టి మేల్కొల్పి,
ఉజ్జ్వలింపఁ జేయు యోగివరుఁడు,
కట్టె రాచి నిప్పు గాంచు తెఱంగున !
విశ్వహిత చరిత్రి, వినర, మిత్ర ! 489

కుండలిని యటంచు కొనియాడిరాశక్తి ;
తలను క్రింద చేసి వెలయుదాని
ఊర్ధ్వశీర్షకమ్ము నొనరించు సంయమి;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 490

వెన్నుపాము నంటి యున్నదం డ్రీశక్తి,
తల్లక్రిందు లౌటవల్ల తెలివి
తప్పియుండె; పైకి తలద్రిప్ప రాణించు;
విశ్వహిత చరిత్రి, వినర, మిత్ర! 491

నిఖలనాడులందు నిద్రించు నీశక్తి
బ్రహ్మనాడియందు పాఱఁ జేయ
నలఁడు పడయుఁజాలు నణిమైశ్వర్యంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 492

బ్రహ్మనాడి మూర్ధపర్యంతగామిని
అక్షరాత్మతత్త్వ మరయుత్రోవ;
అందు తిరుగువాని కటచేతిదగుశక్తి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 493

వేయిరేకులున్న విరిదమ్మిలో శక్తి
నిండి యుండు; నిద్రనుండి లేచి,
అందుకొనఁగ యత్న మాచరింప ఫలించు ;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 494

సంయమీంద్రు లధికసాధన మొనరించి,
శక్తి దీప్తి వడసి సర్వసిద్ధు
లెఱిగమించి జగతి కందింపరె శుభంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 495

ధ్యానధారణలు సమాధితో నొడఁగూడి
సంయమం బనంగ సాఁగుచుండు;
సంయమించుయోగి సర్వసిద్ధుల నందు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 496

యోగము

శైవమతమె తొలుత జగతిపై జన్మించి
యోగమర్మములను ఉగ్గడించె:
నాగలింగపుష్పమే గుర్తు దీనికి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 497

శైవసిద్ధ లెల్ల చాటినా రష్టాంగ
యోగమార్గ ముత్తమోత్తమ మని!
కపటయోగు లెల్ల కనుగొంటిరొ శర్ధాని!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 498

మనసు వశపడంగ నొనరించు సాధన
చాల గలదు, యోగి జడత వీడి,
నిగ్రహింపవలయు నెమ్మది నెమ్మది;
విశ్వహిత చరిత్ర,వినర, మిత్ర ! 499

చిరసమాధిసుఖము చిక్కునా మాటల
తెరపి లేని యోగ దీక్షఁ గాక,
కోయకుండ పిలువ కాయలు రాలునా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 500

*బాహిరాంగములను పట్టఁ జాలనివాఁడు
అంతరంగసిద్ధి నందఁ గనుట,
మొదటిమెట్లు వీడి తుదిమెట్ల నెక్కుటా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 501

తిమిరమందు దారి తెల్పును దీపంబు;
జ్ఞానపథము సూపు సద్గురుండు;
అమృతసిద్ధిఁ గూర్చు నధ్యాత్మయోగంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 502

* అష్టాంగయోగములో యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహారములు బహిరంగములు అనియు, ధారణా, ధ్యాన, సమాధులు అంతరంగములు అనియు చెప్పబడును.

వేదశిఖలు చెప్పు విశుతాధ్యాత్మిక
యోగమునకు సాంగ యోగమార్గ
మన్వయించి నడువ నగు తత్త్వ సంసిద్ధి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 503

వాదము

వివిధవాదములను వెడలి తత్త్వము నింత
నిర్వచింపలేక నివ్వెఱపడె,
అనుభవైకవేద్య మది వాదసాధ్యమా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 504

బుద్ధివిలసనములె పో! వాదధోరణు
లున్న తత్త్వ మున్న దున్నయట్లు
గోచరించు యోగ మాచరించెద వేని !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 505

వాద మెప్పు డేని భేదాల సమకూర్చు:
యోగ మన్వయంబు నొనరఁ జేయు;
వాదికంటె యోగివరుఁ డుత్తముఁడు సుమీ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 506

వాదులాడు నెడల సాదులతో నైన,
మనసు కలఁత చెందు, మహిమ దొరఁగు;
మన్ను చల్ల నీరు మలినంబు గాకున్నె!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 507

అధిపుఁ జేయువాఁడ నై దవశతి కాంధ్రి
సంస్కృతాంగ్ల హింది సత్కవిని మ
హావధానిని శరభాచార్య గణితజ్ఞు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 508

—:—

## షష్ఠ శతకము

### రసవాదము

రాత్రి పవలు నాక రసవాద విద్యకై
పాటొనర్చి భంగ పడుటకంటె,
కాయకష్టమునను గంజిత్రావుట లెస్స !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర 509

పసిఁడి సేయ నెంచి పలురీతుల శ్రమించి,
చేతి కాసు లెల్ల "సెలవు చేసి"
చిప్ప చేతఁ గొన్న శ్రీమంతు లున్నారు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 510

ఇహసుఖంబులను ఘటిల్లఁ జేయఁగ వచ్చు,
కోట్ల కీశ్వరునిఁగఁ గూర్పవచ్చు,
హేమవిద్య మదికి నెటు భ్రాంతి చేకూర్చు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 511

మనసు బంగరువుగ మార్పఁ జాలక యున్న
పసిఁడి సేయు పాటు పడుట వెఱ్ఱి;
*ఎడఁద బంగరైన హేమరాశు లవేల!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 512

రసము బ్రహ్మమన్న రసరహస్య మెఱింగి
సరసుఁ డౌట శాస్త్ర సమ్మతంబు;
బ్రహ్మ వాద మవును రసవాద మప్పుడు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 513

పాదరసము రసముగాఁ దలంచినవాఁడు
పసిఁడిరాసు లంద పాకులాడి,
ఖేదమోదములకు పా దయి నశియించు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 514

మాయ

మాయశక్తి మదికి మాటల కందదు!
మాయ గెలువ నరిది మానవులకు;
•మాయ గెలుచువాఁడు మహితాత్ముఁడగుఁజుమీ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 515

---

*పాఠాంతరము :—
మనసు బంగరైన మహనీయుఁ డగుఁ గదా।

పాఠాంతరము—
• మాయ గెలిచె నేని మనుజన్మ మొందదు।

లేనిమాయ యుండులీల నటించుచు
నరుని మోహపెట్టి నష్టపఱుచు;
ఎండమావు లత్తి నెలయించి లాగవా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 516

మంచువంటిమాయ మనుజులపైఁగప్పి,
తెలిసికొనఁగ నీదు దివ్యపథము;
ఎండవంటి తెలివి హెచ్చ నద్ది నశించు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 517

మాయ విడిచి నరుఁడు మనఁదలంచినఁగాని,
మనుజు వీడి పోదు మాయ స్వయము;
పురుషసుఖము గన్న పొలతి వీడునె వాని!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 518

రూపులేనిమాయ రూపు లెన్నొ ధరించి
ఆత్మ బద్ధుఁ జేసినట్టు లొప్పు,
ఆత్మమననమునను అమ్మాయ నశియించు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 519

మాయ నేలువాఁడు మాయాధవుఁడు బ్రహ్మ
మతని నాశ్రయింప నణఁగు మాయ;
భర్తమాట భక్తి పాటించుసతి మాయ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 520

లేనిమాయ యుండులీల నటించుచు
నరుని మోహపెట్టి నష్టపఱుచు;
ఎండమావు లిట్టి నెలయించి లాగవా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 516

మంచువంటిమాయ మనుజులపైఁగప్పి,
తెలిసికొనఁగ నీదు దివ్యపథము;
ఎండవంటి తెలివి హెచ్చ నద్దె నశించు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 517

మాయ విడిచి నరుఁడు మనఁదలంచినఁగాని,
మనుజు వీడి పోదు మాయ స్వయము;
పురుషసుఖము గన్న పొలతి వీడునె వాని!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 518

రూపులేనిమాయ రూపు లెన్నొ ధరించి
ఆత్మ బద్ధుఁ జేసినట్టు లొప్పు,
ఆత్మమననమునను అమ్మాయ నశియించు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 519

మాయ నేలువాఁడు మాయాధవుఁడు బ్రహ్మ
మతని నాశ్రయింప నణఁగు మాయ;
భర్తమాట భక్తి పాటించుసతి మాయ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 520

చాన లోఁతెఱింగి చరియించుపురుషుండు,
చెలికి లోనుగాక మెలఁగ జాలు;
మాయ:మర్మ మెఱుఁగు మహానీయుఁడును నల్లె!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 521

*అలరు నెంతవఱకహంకార మెడఁదలో
అంతవఱకవిద్య యాటలాడు;
మాయ పోయినంత మహితాత్మ మిగులురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 522

మిథ్య.

మూఁడు దశలయందు చూడంగఁబడకుండ
వెలుఁగు నద్దియొక్క వేళయందె,
అట్టి దాని మిథ్య యనిరి తత్త్వజ్ఞులు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 523

జాగ్రదాదులందు జగము తోఁచును గాని,
అల తురీయమందు నణఁగి పోవుఁ;
గాన జగము మిథ్యగా నెంచి రార్యులు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 524

*ఈ సందర్భమున మాయ, అవిద్య-అను మాటలు నమానార్థములో వాడబడినవి.

## సత్యము

ఎల్లవేళలందు నెద్ది మాయము గాక
శాశ్వతముగ వెలుఁగు సత్తొ - దాని
సత్యవస్తు వంచు శాస్త్రజ్ఞు లన్నారు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 525

*నాల్గు దశలయందు వెల్గొందు నాత్మందు
సాక్షిభూతుఁ డగుచు శాశ్వతముగ;
అందుచేత బ్రహ్మ మయ్యెను సత్యంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 526

## జ్ఞానయోగి

మాయ గుట్టు మట్టు మది నెఱింగిన జ్ఞాని
ప్రాతిభాసికముగఁ బరగు జగము
నెండమావులట్లు లెంచి సుఖించురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 527

స్వప్న తుల్యముగను జగము నీక్షించుట,
అల సమాధి సత్య మరసినట్టి
పూర్ణ యోగ సిద్ధ పురుషులకే చెల్లు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 528

* జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి, సమాధి-అనునవి.

వేదఋషులు మొదటి విజ్ఞానవేత్తలు,
ఆవల బుద్ధయోగి నగును చెప్ప,
మఱువఁదగనివారు మాండూక్యకారుండు;
శంకరారవిందు లింక మిత్ర! ౫౨౯

యోగివర్యులందు నున్నతుల్ సానగా
ములు, పతంజలియును, కలుషహర్త
పోతులూరుయోగి, పూజ్యులు వేమనా
ద్యాత్మవిదులె కాదె; ఆర్య! మిత్ర! ౫౩౦

అపర పరమశివుఁడై అగు విశ్వనాథాఖ్య
ఘాత యోగ మహిమ చేతమునకు
అందనట్టిదయ్య! అట్టి యోగీశ్వరు
లెంద ఉదయమంది రిలను! మిత్ర! ౫౩౧

భ్రమరకీటనీతి పాటించి అభ్యాస
పరుఁడ వగుదు వేని, పరుసవేది
వలన లోహజాతి బంగార మగునట్లు
సత్యసిద్ధి మది కేసంగు మిత్ర! ౫౩౨

ఊహ కందరాని ఉత్తమోత్తమసహ
జామనస్కయోగ మందినతని
దర్శనమ్మె చాలు ధన్యులఁ గావింప!
కొలుచువారు సిద్ధిఁ గొనరె! మిత్ర! ౫౩౩

పూర్ణ యోగసిద్ధిఁ బొందిన బ్రహ్మజ్ఞ
సేవ దోషహారము, శ్రీకరమ్ము ;
పక్వఫల కుజంబు పండ్ల నొసంగదా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 534

వి వి ధ ము లు

కల్ల బొల్లు కథల కల్పితాచారాల
నిజము బయటఁ బెట్టి నిలువఁ గలరె !
సత్యవాది క్రీస్తు చంపరా దుర్జనుల్ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర 535

కల్ల మతవిధాల ఖండించి సత్యంబు
చెప్పి దెలిపినట్టి సోక్రటీసు
విసము నిచ్చి చంప వెఱచిరే మూర్ఖులు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 536

"మాలఁడైనఁగాని, పంచముండైనను
బ్రహ్మవేత్త నాకు పరమ గురుఁడు"
అన్న శంకరార్యు హత్య చేయరె ఖలుల్ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 537

"మతము లెన్నియైన మనుజులొక్కటి యని
మానవతనుజాటు మన మహాత్ము
పొట్టఁ బెట్టుకొనరె కట్టిడి వంచకుల్ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 538

ధర్మమోక్షములను దలఁపునఁ జోరనీక,
అర్థ కామ దాసు లైన జనులు
ఆస సేయువారు మీసాలపైఁ దేనె!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 539

వేశ్యకొంప విటుల విడిదిపట్టయినట్లు
చిత్త నిగ్రహంబు చేయలేని
చెనటి మదినిఁ బెల్లు చెలరేఁగు కోర్కులు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 540

ఇంద్రియముల నిగ్రహించి కూర్చుండినన్
పాదరసమువంటి పాడుమనసు
చలన ముడిగి నిల్వఁజాలదాత్మకు లోఁగి
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 541

శాస్త్రముల మథించి సార మేరిచికూర్చి
పలుక వచ్చు సభలఁ బ్రౌఢి మెఱయ,
చిత్తనిగ్రహంబుఁ జేయ నసాధ్యంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 542

తలను గొరిగి కావి ధరియించి కర్మలన్
సన్న్యసించినంత సాధ్య మగునె
చిత్త నిగ్రహంబు! చిరయోగమునఁ గాక!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 543

విషయ వాసనలను వీడిన చిత్తంబు
మోక్షదంబు; విషయ భోగమునను
అదియె బంధహేతువై వినాశముఁ గూర్చు !
విశ్వహిత చరిత్ర,వినర, మిత్ర ! 544

ఎల్ల జీవకోటి నీశుండు సృజియించి
తృప్తి గనక, నరుని సృష్టి చేసి
తనిసె, మానవుండు తన్నెఱింగెడినంచు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 545

మట్టినుండి పుట్టి, మట్టిచేఁ బెరుగుచు,
మట్టిలోనఁ గలియు నట్టిమేని
భోగములకు పాపములు చేయ నేనొక్కొ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 546

మృద్వికారమైన మేను దాల్చినమాత్ర
మృన్మయుఁడ నటంచు మెలఁగ కన్న,
చిన్మయుఁడవు, నీవు చేయనౌ సాధన !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 547

ఱాయి అప్ప దెచ్చి రామునిఁగా మార్చి
పూజసేయు యుగము వోయె నెపుడొ;
ఎల్లవారియందు నీశ్వరత్వంబుఁ
గాంచి సేవ చేయఁ గదర, మిత్ర ! 548

కొండతాళ్ళు దెచ్చి కోరినదేవుళ్ళఁ
జెక్కి, బాహ్యపూజ సేయుకంటె
ఎడఁదనున్న దేవుఁ జూడగన్న తరియింత్రు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 549

మేడలోని దేవు మేనిలో తామర
పూల పూజ చేసి పొందు సుఖము !
మేనిపూలపూజ మెచ్చు హెచ్చుగ హరి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 550

తినని దేవతలకు తిండిపెట్టుటకంటె
తిను అనాథులకును తృప్తిఁ గూర్చ
అన్నవస్త్రములను అందింప క్షేమమౌ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 551

అఖిలభూతకోటియందుండి శివుఁడు నీ
వివిధ సేవ లంద వేచుక పసు:
ప్రాణిసేవ చేసి పడయు మీశ్వరకృప !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 552

నీ శరీరమందు నెగడెడి పరమాత్మ
ఎల్ల జీవులందు నెసఁగు ననెడి
సత్య మెఱిఁగి సలుపు సర్వజీవహితంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 553

వృక్షమూలమందు ప్రోక్షించిన జలంబు
చెట్టు కంతటికిని జేరు నట్లు,
ప్రజకు చేయుసేవ పరమాత్మునకుఁ జేరు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! ౫౫౪

గనులయందొ; కడలిగర్భమందో కాని
పసిఁడి, రత్నరాశిఁ బడయలేము,
ఈశ్వరాఖ్యరత్న మెల్లచోట్ల లభించు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! ౫౫౫

నాటకము రచించి, నటుఁడునై వర్తించు
కవినిఁబోలి, విశ్వకర్త—లోక
సృష్టి చేసి తాన జీవుడై నటియించు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 556

క్లేశపంచకంబు నాశమౌ నుత్తమ
యోగసాధనంబు సాఁగ నేని,
ఈశ్వరత్వ మొదవి యేలెదు జగ మప్డు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 557

ఈశ్వరత్వ మొదవు నేపు గల్గినయంత
జీవధర్మ మెడలి పోవుఁ గాన,
అబ్బురముగ వాని నర్చింతురు జనాళి ;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 558

ప్రజలపూజ లంద భ్రమసి దేవుఁడనంచు
నటన చేయఁ గల్గు నాశనంబు ;
దేవుఁ డైనవాని తీరు వేఱుగ నుండు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 559

ఇంద్రియములతోడ ఎల్ల జగంబును
గాంచుచున్న, లోనఁ గనఁగ వచ్చు
అద్వితీయ సహజ మమనస్కయోగంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర 560

చక్రషట్కమందె సంసారవాసనల్
కష్టముల సుఖాలఁ గలుగఁ జేయు ;
సప్తమమున నిత్యసౌఖ్య మందును యోగి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 561

ఆఱు చక్రములను అందఱ జీవాత్మ
సంచరింపఁ జాలు; సప్తమమున
తిరుగునేర్పుదొక్క స్థిరయోగపరునకే !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 562

ఆఱు మెట్లఁ దిరుగు నప్పుడు కలిగెడు
ప్రాకృతానుభవము భవసహితము;
సప్తమమున నొదవు సచ్చిత్సుఖరసంబు!
విశ్వహిత చరిత్ర; వినర, మిత్ర ! 563

అల సహస్రపత్ర జలరుహంబునఁబొందు
అవ్యయామృత పరమార్థ సుఖము
నందుయోగి కోరఁ డన్యసౌఖ్యశతంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! ౫౬౪

అష్టదళసరోజమందు ఆ యా దిశల
సంచరించుజీవు సరణి నెఱిఁగి,
సంస్కరించుకొనుచు సాఁగు యోగీంద్రుండు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 565

జీవగతినిబట్టి చెందు కామాదుల
నిగ్రహించుకొనెడు నేర్పు గలిగి,
ఊర్ధ్వగామియగుచు నొప్పు యోగీశుండు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 566

నగను కరగఁబెట్టి నాశంబు సేయకే
బంగరువును బొందు వణిజునట్లు,
విశ్వమందె జ్ఞాని విశ్వాత్మ దర్శించు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 567

పాతకాళ్ళె వేగ భస్మమౌ నిప్పులో
పాపముళ్ళె పాతఁబడినఁ గాని
భస్మ మవును జ్ఞాన పావక స్పర్శచే ;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 568

బ్రహ్మభావ మీవు పడయకుండెడుదాక
జీవధర్మి వగుచు చెలగుచుందు;
బ్రహ్మమందుఁ జేర బ్రహ్మమై వెలిఁగెదు
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 569

సహజ శైత్యమైన చందనకాష్ఠంబు
అగ్నిఁ జేరి, అనల మగును గాదె!
బ్రహ్మతత్త్వ మెఱిఁగి బ్రహ్మమౌ జీవుండు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 570

అగ్నిఁ దాఁకినట్టి అన్ని వస్తువులును
అగ్నిరూప మంది అలరునట్లు,
బ్రహ్మదర్శనమున బ్రహ్మమౌదురు నరుల్!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 571

బాహ్యవిషయములను పరికించుమనసుఁ
కంతరాత్మదృష్టి అలవఱచిన,
ఆత్మతేజమందు అది లీనమైపోవు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 572

కలను దిన్నకూడు కడుపు నింపనియట్లు
భౌతికముగ పొందబడెడి సుఖము
ఆత్మసౌఖ్యపరుని అలరింపఁజాలదు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 573

కడలి నున్నయుప్పు కంటికిఁ దోఁపక,
అనుభవించు నాల్క కందునట్టు
లనుభవించువారి కఖలాత్మ తోఁచురా!
విశ్వహిత చరిత్ర,వినర, మిత్ర! 574

వస్తువులనుజూడ వలసియుండును దివ్వె!
దివ్వెఁ జూడ వేఱు దీప మేల?
దివ్వెవైపు చూపు త్రిప్పిన చాలురా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 575

హృదయమందు వెలుఁగు సదమలాత్మనుగాంచు
తెలివి లేక సర్వ దేవతలను
కొలిచినంతమాత్ర కలుగునా మోక్షంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 576

పగటియందె మింట భానుండు వెలుఁగొందు,
విధుడు రాత్రియందె వెలుఁగఁ జాలు;
హృదయమందు వెలుఁగు ఎల్లవేళల నాత్మ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 577

శివుఁడు, విష్ణువనుచు, జినుఁడు, క్రీస్తువటంచు
వివిధ నామ రూప విభ్రమముల
మాయలోన మునిఁగి మఱచినా రాత్మనే!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 578

ఆత్మ నిత్యవస్తు, వంటదు ప్రకృతికి,
సాక్షి యగుచు నెగడు సర్వమునకు;
సాక్షివైన నిన్ను సాధించి కనుగొని
బంధరాశిఁ బాసి ప్రబలు, మిత్ర! 579

ఆత్మ నెఱుఁగునాతఁ డధిగమించు జగంబు,
ఆత్మవేత్త దుఃఖ మందఁబోఁడు;
ఆత్మవేది జగమునం దాత్మఁగని వెల్గు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 580

ఆత్మ జాగరమున ఆజ్ఞ*యందున నుండు.
స్వప్నమున విశుద్ధ చక్రమందు.
అల సుషుప్తిలో అనాహతపద్మాన;
విశ్వహిత చరిత్రి, వినర, మిత్ర! 581

అమృతధామ మైన అల తురీయసమాధి
వేయి ఱేకు లున్న విచ్చుఁదమ్మి (న్)
ఐక్యమై వెలుంగు నాత్మ బ్రహ్మంబుతో!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 582

* ఆజ్ఞ= ఆఱవదైన ఆజ్ఞాచక్రము — భ్రూమధ్య స్థానము — త్రికూటము : జీవుడు విహరించు తావు.

ఆజ్ఞలోన నిల్వ నలవాటు పడుదేని
చిద్విభూతి నంది శ్రీసహస్ర
పత్రచక్రమునకు పయనమై బ్రహ్మాత్మ
మందుకొందు వోయి, హాయి, మిత్ర! 583

వాసనాళి యనెడి వర పుష్ప ఫలములు
పండఁ జేయు చెట్టు ప్రకృతి యనఁగ;
ప్రకృతి గెలువకున్న పర్వదు జ్ఞానంబు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 584

నీటఁ బుట్టు నాఁచు నీటి నాచ్ఛాదించు
పగిది, బ్రహ్మమందు పరగుమాయ
బ్రహ్మతత్త్వ మెఱుకపడనీక పైకొను:
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 585

బ్రహ్మమందు జగము భావింపఁజాలిన
బాధ లేదు జగమువలన నీకు;
జగమునకును కీడు జరుగదు నీచేత!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 586

స్వప్నదృశ్య మపుడు సత్యమ్ముగాఁ దోఁచి
మేలుకాంచినంత మిథ్య యగును;
దృశ్యమాన జగముతీరు నంతే సమాధి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 587

నదుల కున్న వివిధనామరూప క్రియల్
అంబునిధిని జేరు నంత వఱకె
అర్ణవమునఁ జేర, అవి అబ్ధిగనె మాఱు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 588

కట్టె నిప్పుఁ జేరి కాలి, చిచ్చయినట్లు
జీవి బ్రహ్మమందుఁ జేరినపుడె
జీవభావ మెడసి చిన్మయ బ్రహ్మమౌ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 589

మురికివాఁగు లైన పరమపావనిగంగఁ
గలసి గంగరీతి వెలయునట్లు,
పాపి శుద్ధుఁ డగును పరమేశుదరిఁ జేరి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 590

చెఱకురసముచేతఁ జేసిన చక్కెరఁ
జేయ. నౌనె మఱల చెఱకురసము ?
బ్రహ్మమైనవాఁడు పరగునా జీవుఁడై !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 591

తత్త్వదర్శనమున ధన్యుఁడౌ సుకృతిని
మాయ పట్టి కట్టివేయఁ గలదె !
ఆవరింపఁగలదె అంధకారము సూర్యు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 592

తత్త్వవేత్త యనెడి తలపూపఁగాఁ బోవు
విషయవాంఛ లెట్టి వేళలందు;
అంకురించు నొక్కొ అఱచేత వెండ్రుకల్ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 593

బాధ్యమానజగము బ్రహ్మజ్ఞు బాధింప
వలఁతి యగునె? ఎలుక బ్రతికి యుండి
చంపలేదు పిల్లిఁ, జచ్చి చంపునె దాని ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 594

దుమ్ము నింగి కెట్టి దోసఁగొనర్పఁగ లేదు,
కాల్ప లేదు చిచ్చు గాలి(ౝ) నుంత;
జ్ఞానయోగిఁ గట్టఁ జాలవు కర్మముల్ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 595

సర్వమును దహింపఁజాలిన కార్చిచ్చు
గాలి (ౝ) మింటిఁ గాల్పఁ జాలనట్లు,
ప్రకృతి తత్త్వవేత్త(ౝ) బాధింపఁజాలదు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర 596

ఒరులు పొగడ తెగడ నుబ్బఁడు, క్రుంగఁడు
తత్త్వవేత్త ప్రకృతి ధర్మ మెఱిఁగి;
మండుటూఱు టనెడి పుండునే బూదికి ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 597

అజ్ఞులైనవారి ఆడిపోఁతల కెప్డు
పరమ తత్త్వవేత్త బాధపడఁడు;
సంతు తిట్టఁగొట్ట సహియింపఁడా తండ్రి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 598

ఆకసమున పక్షి అడుఁగుజాడను బోలె
నీట చేపకాలి బాట వోలె
జ్ఞానినడత ఎఱుఁగఁ జాలరెవ్వరు గాని!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 599

దేవుఁడైన, మనుజదేహస్థుఁ డగు నేని
ఎఱుఁగలేరు మూఢనరులు వాని;
నరుని బ్రహ్మవేత్త నెఱుఁగఁజాలుదురొక్కొ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 600

ఆలుమగలు గాని, అన్నదమ్ములు గాని,
తల్లి దండ్రు లేని, తనయు లేని
ఒకరి నొకరె అర్థమొనరించుకొనలేరు;
పరుల మాట చెప్పవలెనె మిత్ర! 601

పిచ్చివానిఁబోలి, పిన్నవానింబలె,
గాలిసోకినతని కరణిఁ దిరుగు
బ్రహ్మవిదుని గుర్తుపట్టుట సాధ్యమా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 602

పూర్ణుఁడౌ విభుం డు పుణ్ణుడు నొకనాఁడె,
బ్రహ్మవేత్త యైన పరమయోగి
నిత్యపూర్ణుఁ డగుచు నెగడు నేదశనైన !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 603

కాంచు జగము ద్రష్ట కల్పనావస్థలో,
కాంచ లేఁడు నిర్వికల్పదశను,
కల్పనిర్వికల్ప గతుల దాఁటును యోగి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 604

ఇంట వెలుఁగు దివ్యు లెవ్వరి నేనియు
పనులు చేయుఁడంచు, వలదటంచు
చెప్పఁబోము; వారె చేసికొందురు పనుల్ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 605

ఎడఁద నాత్మ వెలుఁగ నింద్రియములు తామె
కార్యముల నొనర్పఁ గడఁగుచుండు;
దివ్యకర్త గాదు, దివ్యాత్మయునుగాదు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 606

అవ్యయాత్మ తత్త్వ మనుభవింపఁగవచ్చు,
ఇట్టి దనుచుఁ జెప్ప నెవరి తరము !
తినునె గాని మూఁగ తెలుపునా రుచులను!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 607

అస్తి యన్నదాని నాధారముఁ గాని
నాస్తి యన్నపలుకు నాట్యమాడు;
అస్తి నాస్తు లనున వరయ సాపేక్షముల్;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 608

ఏయపేక్ష లేక యెసఁగెడి తత్త్వంబు
లోఁగు నొక్కొ తర్కలోకమునకు!
అస్తినాస్తులకును అవ్వలి దది కదా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 609

సందియములు లేని సర్వ విజ్ఞానంబు,
భయము లేని సర్వ భద్రపదము,
క్లేశ కర్మ బంధ నాశకాత్మస్థితి
నందుకొనుట మోక్షమగును మిత్ర! 610

సౌఖ్యదుఃఖములును సర్వవికారమ్ము
లంటుకొనని అవ్యయామృతత్వ
మయి వెలుంగుటగును అక్షయమోక్షంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 611

షష్ఠశతక మిద్ది, స్వామి తత్త్వానంద
పాదపూజ కిడిన భవ్య సుమము;
అంకిత మ్మొనర్తు ఆ యతీశ్వరునకే!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 612

# సప్తమ శతకము

## కర్మ యోగి

మఠము, లాశ్రమములు, మహిమలు, శిష్యులు,
దేవతా ప్రతిష్ఠ, తీర్థ సేవ,
గురుఁడ నంచు పూజఁ గొనుట, పూజించుట–
బంధకములె; వానిఁ బాయు మిత్ర! 613

కర్మదోషరాశి కడగంట్ల పాల్సేసి,
దుఃఖకూపమందుఁ ద్రోయుఁ గాన,
దుష్టకర్మములకు దూరుఁడై సత్కార్య
కారి యగును మోక్షగామి; మిత్ర! 614

మంచికర్మనైన మమకారమునఁ జేయ
కనకశృంఖలవలెఁ గట్టు నద్ది;
కాన యోగ్యకర్మ నేని నిర్మముఁ డయి
చేయుచుండు యోగశీలి మిత్ర! 615

అంటకుండ మది కహంకార మమకార
భావ మెవఁ డొనర్చు పరమనిష్ఠఁ
గర్మ లట్టియోగిఁ గట్టంగ లేవవి;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 616

ఇష్టమైనపనుల నెడపక చేయుటే
కాదు; మదికి నింపు గాని పనుల
సైతమాచరించు సత్కార్యములయేని;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 617

మృత్తులోనఁ దిరుగు మృత్తికాటకమునకు
బురద యంటనట్లు భువిఁ జరింప
వలయు యోగి కర్మబంధాతిగామియై !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 618

గొడ్లఁ గాసికొనెడి కుఱ్ఱఁడా పశువుల
పాలు కోరకుండ పనినె చేయు;
పనినె చేయు యోగి ఫలిత మాసింపఁడు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 619

జీవితమును విడిచి, చిద్రసరూపివై
అలరు మనుచు కొంద రందు రిలను;
బ్రతుకు చిన్మయముగఁ బాటించి నరసేవ
చేయుచుంట పరమ సిద్ధి మిత్ర ! 620

గురుశిష్యులు

బ్రహ్మవేత్త, ద్వంద్వరహితుండు, విజ్ఞాని,
భూత హితకరుండు, భువనపూజ్యుఁ
డైన దేశికుని సమాశ్రయింపఁగ నగు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 621

శత్రుమిత్రులందు సమదృష్టి కలవాఁడు,
పక్షపాత రహిత భావనుండు,
శిష్యవత్సలుండు సేవనీయుఁడు సుమ్మె !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 622

చెప్పినట్లుచేయు శిష్టాచరణశీలి,
శమదమాది సకల సద్గుణుండు,
దంభ మాన మోహ దర్పాది రహితుండు
ప్రార్థనీయుఁ డెపుడు పరమ మిత్రి! 623

అఖిలమందు నాత్మ, నాత్మయం దఖిలంబు
కాంచి మరియు మోక్షగామి, బుధుఁడు;
ఆత్మరతుఁడు, తుష్టుఁ డగు యోగిఁ గొల్వనో!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 624

మూఁడు గుణము లెనసి మువ్వురుమూర్తులు
పూజ్యులైరి సకల భువనములకు;
గుణము లెల్ల వీడి గురుఁడు బ్రహ్మంబయి
భవమునుండి తేర్చు ప్రజల మిత్రి! 625

గురుఁడు, హరుఁడు నొకట గోచరించిర యేని
హరునికంటె ముందు గురుని కెరగు!
గురుఁడు హరునిఁ జూప పరమకారణుఁ డౌట!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 626

టక్కు టెక్కు చూపి నిక్కుచు నీల్గుచు
ముక్తి చేతి కంది యిత్తు మనుచు
శిష్యవిత్తములను చేఁజేతఁ దోచెడి
దుష్టగురులఁ జేర నష్టి మిత్రి! 627

పాదపూజ లంచు, పల్లకీ ల్వాహనా
లెక్కి తిరుగ నుదగి రొక్కములను
సంచి నింపుకొనెడి వంచకుల్ పరతత్త్వ
పథము సూపఁగలరె? పరమ మిత్ర! 628

అపర శివుని కరణి నుపరతచిత్తుఁడై
బ్రహ్మనిష్ఠుఁడైన పరమయోగి;
అట్టి గురుని హేతు నర్చింప పురుషార్థ
సిద్ధి పాదపీఠిఁ జేరు; మిత్ర! 629

సద్గురుని విచిత్ర సర్వలీలల నెన్న
ఆదిశేష ఫణికె అలవి గాదు ;
కవులు సంస్తుతింపఁగలరె తన్మహిమంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 630

తెలియనట్టి వెల్లఁ దెలిసినట్లు నటించి,
పరుల మోసగించి బ్రతుకుఁ దోఁపియు
పొట్టకూటి గురుల పొందొంద కీడౌను!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 631

సద్గురుత్వపదము సర్వసాధ్యము కాదు,
గాఢయత్నమున నొకానొకనికె
అబ్బు కోట్లసంఖ్యయందెంచి చూచిన!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 632

కల్లగురులు జగతి నెల్లతావులయందు
ఉల్లి కోకఁడు, పిల్లి కోకఁడు గాఁగ
పుట్టఁగల రటన్న పోతులూర్బ్రహ్మన్న
మాట యది వరాల మూట! మిత్రి! 633

గురులు గాని శిష్యకోటులు గానిండు,
కామినీ మణులను, కాంచనంబుఁ
గాంచి మోహపడని యంచితబుద్ధులే
చెందఁగలరు తత్త్వసిద్ధి మిత్రి! 634

కష్టముల సహించి, అష్టాంగయోగంబు
నెడప కాచరించి, మెల్లఁబోర్ద్దు
ఆత్మదర్శనమున అమృతులౌదురు వారు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 635

లోకదుఃఖములను బోకార్చి ప్రజలకు
సత్పథమ్ము చూపి శాంతిసుఖము
లలవరించు పుణ్యు లా గురుశిష్యులే!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 636

చిరపరీక్షఁ జేసి, శిష్యులఁ గడతేర్చు
గురులలోన బ్రహ్మగురుఁడె గురుఁడు;
సిలుగులను సహించి, సిద్ధి గన్న సుశిష్య
తతిని సిద్ధు నెన్నఁ దగును మిత్రి! 637

అన్ని చోట్ల నుండు రాషాఢభూతుల
వంటిశిష్యకోటి; భవ్యగుణుఁడు
ఉండునొక్కొ నూటి కొక్కరుఁ డెటనేని !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 638

గురునిమాట వేదగుహ్యమా వెవనికి,
గురు నికార్య మెవఁడు కొసరి చేయు,
గురునిదప్ప నెవఁడుకోరఁ డింద్రత్వమే
నట్టి శిష్యు యోగ్యుఁ డంద్రు మిత్ర ! 639

దేశికుండె బ్రహ్మ, దేశికుఁడే హరి,
దేశికుండె శివుఁడు, దేశికుండె
అవ్యయాద్వితీయ మగు పరబ్రహ్మంబు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 640

తెలిసి తెలియకేని దేశికద్రోహంబు
సలుపునతఁడు నరక మొలసి డిందు;
లేదు వాని కెన్ని లీలల నిష్కృతి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 641

తత్త్వ మెఱుఁగఁ జేసి దారుణ సంసార
బంధముక్తి గూర్చు పరమగురుఁడు
ఎన్ని రెట్లొ అధికుఁ డీ జన్మ నిచ్చిన
మాతృపితలకంటె మాన్య మిత్ర ! 642

ఆత్మవేత్త కాని యాతఁడు గురుఁడైన
శిష్యతతికి తత్త్వసిద్ధి సున్న;
అంధుఁడెట్లు చేర్చు నంధుని గమ్యంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 643

## టక్కరిసాధులు

స్వామివేష మూని సారసాక్షులఁ బట్టి,
జన్మములని విత్తచయము దోచి,
బ్రతుకు మోసగాండ్రి వలలఁ జిక్కకు మెప్డు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 644

కామినులను బట్ట, కాంచనంబును గొట్ట,
తపసి వేసములను దాల్చుకూళ
ప్రతిభ సాగవచ్చు పామరజగమున;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 645

మది విరక్తమైన మఱిసన్న్యసన మేల?
వేషమునకు మనసు విఱుగఁ గలదె!
వేసమునకు బుధుఁడు విలువ యొసంగునా?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 646

వేష మెన్న వెలిది, విజ్ఞత లోనిది,
జ్ఞాన మొకటె మోక్షసాధనంబు;
వట్టి వేష మూని వంచింపకు జగంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 647

విశ్రుతచిత్తు లెట్టి వేషాలు వేసిన
కాంచలేరు ముక్తి కలను గూడ;
చిత్తశుద్ధి యున్న చేకూరు సంసిద్ధి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 648

దొంగసాధు విలను దోచఁబూనిన నెల్ల
కాల మట్లె సాగఁ గలదె టక్కు !
మోస మెప్పుడైన ముప్పు దేకుండునా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 649

ఒక్కకంట నరుఁడు టక్కరి సాధులఁ
గాంచి పట్టుకున్నఁ గలుగు కీడు;
సైపఁ గూడ దట్టి సంఘవిద్రోహుల !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 650

గీత చెప్పినట్టి కీర్తనీయ గుణాలు,
వర్తనంబు గలుగువారి నెల్ల
నిక్కమైన సాధునికర మం చెంచరా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 651

స్త్రీ

నారిఁ గాంచి మోహవారిధిలో మున్గి,
ఆపదలకు నేల అగ్గ మగుదు !
చానలోని ఆత్మసాక్షిని గుర్తింపు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 652

కామినీవిగర్హ గావించినంతనే
మోహ మంతరించి ముక్తి రాదు,
పడతిలోన నున్న పరమేశు దర్శించు
విద్య పట్టువడక, వినర, మిత్ర ! 653

శోణి తాస్థి మాంస శుక్ర మజ్జాదుల
యిల్లు దేహ మనుచు నెల్లవేళ
చింత చేయు దేని చిగిరించు వైరాగ్య
మవల నాత్మ వెనుక నగును మిత్ర ! 654

బ్రహ్మచర్యదీక్ష పాటింప స్త్రీసౌఖ్య
కాంక్ష యొక్కవేళఁ గలుగవచ్చు;
గాధిసుతునిఁగనమె ! కావున గార్హస్థ్య
మధిక ఫలద మంచు నరయు; మిత్ర ! 655

అశ్వపతియు, జనకుఁ డా వీరసద్గురుం,
డతని సుతులు, శిష్యు లాదిగల్గు
జనులు గృహపతులుగ సాధింపరే ముక్తి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 656

స్త్రీత్వపుంస్త్వములు శరీరసంబంధు లీ
లింగ లక్షణములు భంగురములు;
లింగరహిత తత్త్వ మంగమందునఁగాంచి
జగము నుద్ధరింప సాఁగు మిత్ర ! 657

## ప్రకృతిపురుషులు

అబ్ధి నలలు పొడమి అణగారు నట్టుల
ప్రకృతి (౬) భూతచయము ప్రభవ మంది,
అణఁగు, ప్రకృతి పురుషు నాశ్రయించి నటించు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 653

పురుషుఁ డనఁగ నీవె, పసుఁడవు ప్రకృతికి,
ఇది యెఱింగి ప్రకృతి నెనయకుండ
తిరుగు తెలివి గనుటె పరమమోక్షపథంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 659

ప్రకృతి దృశ్యమగును; పరుఁడగు పురుషుండు
దృక్కు సూవె; దృక్కు-దృశ్యములను
ఒక్కటని తలంప నొందెదు బంధంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 660

ప్రకృతి యనఁగ—భూతపంచకం, బవ్యక్త
మహదహంకృతులు సమంచితేంద్రి
యములు, విషయజాత-మివి సాధనంబులు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 661

ఇరువదియునునాలుగీ తత్త్వములు, వీటి
కవలివాఁడె పురుషుఁ, డతఁడె పంచ
వింశకాత్ముఁ డగుచు వెలిగించు వీటిని !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 662

ప్రకృతి త్రిగుణమయము, ప్రకృతిప్రభవములౌ
నన్ని, తద్గుణముల నంటకుండ
నుండఁజాల వేవి; ఒక్కఁడాత్మునేఁడు దక్క!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 663

సత్వగుణముకల్మి సాఁగు నుత్తమగతి,
అధమగతికి నీడ్చు నా తమస్సు,
చెందు నడిమిగతిని జీవి రజస్సుచే!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 664

తమముచేత మూఢదశ వహించును చిత్త
మా రజోగుణమున నగును క్షిప్త,
మెనయు నెడఁద సత్వమునను విక్షిప్తత!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 665

శుద్ధసత్వమునను జొప్పడు నేకాగ్ర
భావ మవల వరుస పట్టువడును
ఆ నిరుద్ధమనెడు మానిత సుస్థితి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 666

గుణములెల్ల వీడి, కోరికలను దాటి
ఆనిరుద్ధమందు అధివసించు
పుణ్యపురుషుఁడందు పురుషోత్తమప్రాప్తి;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర 667

## చిజ్జడములు

జడమునుండి ప్రాణశక్తి, చైతన్యంబు
పరిణమించుననుచు పలుకుచుంద్రు;
అట్టులైన చిత్తు-* అంతవంతంబు కా
వలసివచ్చుఁ గాదె పరమమిత్ర! 668

జడముపాధిగాఁగ సాఁగి చిత్తత్త్వంబు
వ్యక్తముగ నొనర్చు భంగి గనక,
జడపరిణతిఫలమె సచ్చిదాత్మ యటంచు
నాస్తికులు వచింతు రయ్యా, మిత్ర! 669

అణుమహత్తులందు నంతట పూర్ణమై
నిండి వెలయు చిత్తు నిజ మెఱుఁగక,
స్థూలజడముఁగాంచి శుష్కసిద్ధాంతాలు
పలుక నేమి ఫలము! పరమ మిత్ర! 670

సూక్ష్మతమజడంపు చోద్యము దెలియక
సూక్ష్మతమముకంటె సూక్ష్మమైన
చిత్తు నెఱుఁగఁదివుర సిద్ధించునె ఫలంబు?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 671

*ఉత్వసంధిని పాటించినచో "చిత్తదంతవంతంబు" అని పఠింపవలయును. చిత్తు + అది + అంతవంతము అనివిభాగము.

వెలిని, లోన-చిత్తు వెలయించుకొని, దానిఁ
దోఁపనీక, జడముఁ దోఁపఁ జేయు
చిత్రశక్తిమహిమ చిత్తత్త్వవేత్తకే
యెఱుక, పరుల కెఱుఁగఁ దరమె? మిత్ర! 672

జడము పరిణమించి సచ్చిదానందమ్ము
వ్యక్తముగ నొనర్చు శక్తిఁ గనుట
సృష్టితత్త్వ మనుచుఁ జెప్పరె వేత్తలు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 673

సూక్ష్మ తత్త్వములను శోధించి శోధించి
అరయఁ జాలుశక్తి నందకున్న,
బ్రహ్మకైన బోధపడదు పో* చిజ్జడ
పర రహస్య మింత; పరమ మిత్ర! 674

శుష్క-యోగులకును, శుష్క-వేదాంతుల
కనుభవింపఁ గాని దత్త్వాతీత
మైన తత్త్వ మద్ది, అనుభవపరులకే
గమ్యమాన మగును గదర, మిత్ర! 675

* చిజ్జడ పర రహస్యము=చిత్తు జడముల యొక్కయు, వాటికి పరమైనదానియొక్కయు రహస్యము.

ఋతము, చిత్తునవల-ఋతచిత్తు ననుభూతి
పొందునతఁడె సుమ్ము పూర్ణయోగి;
చిద్భృతమర్మ మెఱుఁగు చింతన బహుజన్మ
ఫలిత లభ్య మోయి ! పరమ మిత్ర ! 676

జడమునట్టి జీవశక్తి యొకప్పుడు
చలనశూన్య మగుచు పొలిచె, పిదప
కదల సాఁగి జగము కబళింప స్వాతంత్ర్య
మెనసి నాట్యమాడ మొదలె; మిత్ర ! 677

జడము చేతనముగ, చైతన్య మది జడ
ముగను దోఁపఁజేయు పూర్ణశక్తి
నెఱుఁగుయోగివరుఁ డతీంద్రియద్రష్టరా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 678

పుస్తకములు చదివి పొందెడి జ్ఞానమే
పూర్ణ మనుచుఁ దలచి మోసపోకు;
అనుభవమున, యోగ మాచరించుటచేత
నిండు తెలివి కంది పండు, మిత్ర ! 679

## త ర్క ము

తత్త్వశాస్త్ర దృష్టి తగ్గిపోవుటఁ జేసి
పిచ్చిసమ్మకములు పెచ్చుపెరిగె
చదువుకొన్నవారి మదులందు సైతము;
సద్విచార మెట్లు సాఁగు ! మిత్ర ! 680

తర్కబలము లేక తత్త్వశాస్త్రముకూడ
సాగఁబోదు; సద్విచారపరులు
తగిన హేతువులను తెగడక తత్త్వంబు
తఱచి పొందు టొప్పు; పరమ మిత్రి ! 681

తర్క మందుకొనని తత్త్వార్థములు కొన్ని
యున్నమాట సైత మొప్పవంబె;
అరయు మట్టివాని నతిమానసములుగా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 682

హేతుబలముచేత వచిక్క వీడునో,
దర్శనమున నెట్టి తత్త్వసిద్ధి
కలుగునో ఎఱుంగఁ గలరు సత్సాధకుల్ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 683

సర్వ దశలయందు, సర్వకాలములందు
తత్త్వమును గుఱించి తగువిధముల
నిరతసాధనంబు నెఱపఁ గల్గుదు వేని
సిద్ధి పాదపీఠిఁ జేరు; మిత్రి ! 684

## నీ వె వ రు ?

దేవుఁ డెత్తినట్టి దివ్యావతారాలు
వెదుకఁ జూచు నరుఁడు వెఱ్ఱియగుచు;
తాను పొందిన యవతారమ్మునఁ గూరిచి
చింతసేయు మోక్షసిద్ధి; మిత్రి! 685

ఏ నెవండనంచు-ఎవ్వండు చింతించి
తన్నుఁ దా నెఱింగి, తత్త్వవేత్త
అగునో-బంధముక్తి అతని కబ్బును !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 686

జీవుఁ డతనిపైని దేవుండు నీలోన
వెలుగుచున్నవాఁడు; మలినమైన
మనసు తెలియనీక మాయకుఁ దార్చె నిన్ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 687

కరచరణము లీవు కానట్టు లీ స్థూల
దేహ మీవు కావు; దేహము గల
దేహి వీవటంచు తెలియుఁబూనుట నిన్ను
నీ వెఱుంగు తెరువు సూనె; మిత్ర ! 688

"నా గృహమ్ము, ధనము, నా వస్త్ర మిది" యని
అన్న యప్పు డా గృహాదికముల
కెట్టు లీవు వేఱో, అట్టులే నా దేహ
మన్నయపుడు సైత; మాప్త మిత్ర ! 689

నా మనస్సు, బుద్ధి, నా భావ మందువు;
కాన నవియు నీవు కావు, కావు !
మనసు-బుద్ధి గల్గు మహితాత్మ వీవురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 690

శాశ్వతుఁడవు నీవు, జ్ఞానస్వరూపివా
నంద మీవు, ప్రకృతిచంద మింత
పొందనట్టి శుద్ధబుద్ధాత్ముఁడవు సుమీ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 691

అష్టవిధములైన అవ్యక్తమహదహం
కార, భూత పంచకముల వలనఁ
గలిగినట్టి మూఁడుకాయముల్ గలనీవు
వాటి కంటె వేఱు; పరమ మిత్ర ! 692

ప్రకృతితోడ పొత్తు ప్రాప్తించుటం జేసి
ప్రకృతి నీవె యంచు భ్రాంతిపడెదు;
అల సుషుప్తియందు, అసమ సమాధిలో
ప్రకృతికంటె వేఱు పడెదు మిత్ర ! 693

కలిగియున్నవాఁడు కలవస్తువునకంటె
నెపుడు భిన్నుఁడగుట యెఱుఁగ మొక్కొ;
కలవు నీకు బుద్ధి కర్మేంద్రియాసువుల్ !
కాన అవ్వి నీవు గావు; మిత్ర ! 694

నీవు సాధకుఁడవు, నీకు దేహేంద్రియాల్
సాధనములు, ముక్తి సాధ్యమగును;
సాధ్య సాధనములు; సాధకుం డను భేద
మెఱిఁగి బ్రతుకు నడపు; పరమ మిత్ర ! 695

పంచభూతములును, వాటిచేఁ బుట్టిన
ఇంద్రియములు, ప్రాణ, మెడఁద, బుద్ధి,
అన్నిపను లొనర్చునట్టి యహంకార
మీవు గావు; సాక్షివీవు! మిత్ర! 696

ఎడఁదనుండి పుట్టు నెల్ల సంకల్పాలు,
క్రోధ రాగ లోభ గుణ గణాలు,
నీవు కావు; నిత్యనిర్మలానందైక
శాశ్వతాత్మ వీవు! సత్య మిత్ర! 697

మూఁడు దేహములును, మూఁడైనగుణములు,
వాటివికృతులింక, వాటినుండి
పుట్టువొందినట్టి పుత్ర గేహ ధనాదు
లీవు కావు; సాక్షి వీవు! మిత్ర! 698

పుట్టలేదు నీవు, పోలియు వోకప్పుడు,
జరయు, రుజయు, మార్పు, క్షయము, వృద్ధి
అను వికృతులు నీకు అంట వో కింతేని
సచ్చిదాత్మ వీవు! సత్య మిత్ర! 699

సాధ్య సాధనములు సాక్షిస్వరూపాత్మ
వైన నీవు కావటంచు నెఱిఁగి,
ఆత్మతృప్తి రతుల నప్పర బ్రహ్మవై
విశ్వహితముఁబొంచు వెలయు; మిత్ర; 700

## చక్ర రహస్యము

ఆఱు చక్రముల రహస్యమ్ము తెలియక
ఒక్కఁ డొక్కరుండె కాదు, "మేము
తత్త్వవిదుల మంచు," దలఁచెడి పెద్దలే
మోసపోయినారు మున్ను; మిత్ర ! 701

చక్రభావనమున సాధింపఁ దగినట్టి
ఫలము దేశికేంద్రు పరమ కరుణ
నెఱిఁగి సత్యలోక మఱచేతి యుసిరికఁ
జేసికొనఁగఁ గొఱలు సిద్ధి; మిత్ర! 702

అయిదు భూతములకు ఆధారచక్రాదు
లాశ్రయములు; జీవుఁ డాఱవదగు
చక్రమందు నుండు; సర్వేశ్వరుఁడు సహ
స్రార చక్రవాసి యగును; మిత్ర ! 703

ఆజ్ఞనుండి ప్రత్యగాత్మ సహస్రార
పద్మమున వెలుంగు బ్రహ్మమందు
ఐక్యపఱచునాతఁ డా పరబ్రహ్మమై
పరమ మోక్షసిద్ధి పడయు; మిత్ర! 704

*యోగదర్శనమున ఉగ్గడింపంబడె
చక్రమర్మములును, సాధనములు;
అరసి వాటి నిత్య మాచరించి ఫలంబు
లంది ధన్యతముఁడ వగుము; మిత్ర ! 705

---

* ఈ గ్రంథకర్త వ్రాసినది.

క త్రియంచుమీఁద క్రమియించుకొంతటి
కష్టతరము చక్రగతుల నరసి
బాట సాగు టంత బాధాకరంబని
యెంచి మెలకువను క్రమించు; మిత్ర! 706

ఆఱుపద్మములను అలరారుదళముల
భావ మేమొ, అందు పరగు వర్ణ-
మాల తత్త్వ మేమొ మఱిమఱి భావించి
అక్షరాతిగామి వగుము; మిత్ర! 707

ఎద్ది పరమవాక్కొ, ఏది పశ్యంతియో,
ఏది మధ్యమంబొ, యేది చెవికి
వైఖరిగను దోచు వాక్కొ-వాటినెఱింగి
బ్రహ్మతత్త్వ పథముఁ బట్టు; మిత్ర! 708

వైఖరిని నెఱుంగ వలఁతియే ప్రతివాఁడు,
మధ్యమమ్ము కొంతమంది కెఱుక,
పట్టువార లరుదు పశ్యంతి యనుదాని,
పరను కోట్ల నొకఁడె పడయు; మిత్ర! 709

చక్రతత్త్వ మెఱుఁగఁ జాలక పరవచ
స్తత్త్వ మేదొ మదికి తట్టఁబోదు;
కాన చక్రమహిమఁ గాంచఁగావలె యోగి
గుర్వనుగ్రహమ్ము కోలఁది; మిత్రి 710

మొదటి తమ్మినుండి మొదలౌ ప్రయాణంబు
నాహతమును జేర అర్ధ మగును;
ఆజ్ఞ చిట్టచివరి దవ్వాలి గమ్యంబు
చేర గలుగు మోక్ష సిద్ధి; మిత్ర! 711

చెప్పినారు గురులు శ్రీచక్రమునయందు
ఆఱు చక్రముల రహస్యములను;
ఆచరించువార లరుదౌట నాయోగ
పథము నష్టమయ్యె పరమ మిత్ర! 712

బ్రహ్మ తీర్థగురుఁడు ప్రవచించె తనజగ
చ్ఛిల్పమం దపూర్వశిల్పగరిమ
సృష్టితత్త్వవిధము, శ్రీచక్రమహిమంబు
కాంచి, ఆచరింపఁగదర; మిత్ర! 713

సప్తమంబు జ్ఞానశతక మిద్దానిని
సత్యశోధకుండు శతవధాని
శిష్యుఁడైన శ్రీ వి. శివరామశాస్త్రికి
అంకితం బొనర్తు; నార్య మిత్ర! 714

—*—

# అష్టమ శతకము

## ఆత్మరమణము

జ్ఞాతవైన నీవు జ్యోతిరూప జ్ఞేయ
మగుచు సాధనమున నందదగిన
పరమసిద్ధి యంచు ప్రియతించు నిరతంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 715

జనకముఖ్య యోగిసమితి జ్ఞాతజ్ఞేయు
లై చిదాత్మరమణ మందినట్లు,
విహరణంబొనర్చు వేదాంతి నిరతంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 716

ఆత్మరూప నిశ్చయాభ్యాస, మనుభూతి
యెట్టి దశనుగాని, యేమొనర్చు
చున్నగాని చెదర కుండుటే సంసిద్ధి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 717

నిత్యముక్తులయిన నిర్గుణాత్ముల సదా
చరణ మెల్లయపుడు సాధకులకు
పట్టువడిన, ఇంక బంధ మే ముందురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 718

సత్పదార్థమున కసద్వస్తువునకును
మూలమయ్యె నది అమూలమగుచు
సదసదన్యమై యెసంగు నాత్మత్వంబు
తానయై రమించు జ్ఞాని, మిత్ర ! 719

నీరములను విడి, క్షీరముల్ గ్రోలెడి
హంసపగిది జగము నంటకుండ
బ్రహ్మదర్శనమున పరవశించుచు యోగి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 720

విశ్వమందు ఆత్మ, విశ్వంబు నాత్మలో
క్షీరనీరములను వేఱుపఱచు
పగిదిఁ జూచుఁగాన పరమహంస యనంగ
పేరు వడసె తత్త్వవేత్త; మిత్ర ! 721

బ్రహ్మమీజగముగ భాసించుటం జేసి
తోఁచు జగమె; ఆత్మ తోఁచఁబోను;
నీరు పాలఁ గలసి క్షీరమై తోఁపదా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 722

గాలిచేత అలలు కలిగినట్టుల నీట
బ్రహ్మమందు జగము పరగు మాయ(ౘ)
అలలు నీరమైన యట్లె, బ్రహ్మమె జగంబు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 723

పూర్ణయోగియందు పొడమ దహంకృతి,
అహము చావ, దాని స్పృహ నశించు
అహమునురణి ముక్తి నందుకే సుజ్ఞాన
మదియె తత్త్వవిద్య యగును; మిత్ర! 724

## జ్ఞానసాధన

పొల్లయొడలిసుఖము లుల్ల మాకర్షింప
శాశ్వతాత్మసుఖము చాయఁ గనఁడు;
మందబుద్ధినైన మనుజు నేమనవలె !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 725

ఎండమావులందు నెనయు నీ రాశించి
చేతి యమృతపాత్ర గోతఁ ద్రోయు
మందు లెట్లు తత్త్వమార్గాన పయనింత్రు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 726

ధనికుఁడైనవాఁడు ద్రవ్యాశ విడనాడి
భవ్యయోగపథముఁ బట్టుటెన్న
సూదిబెజ్జమందుఁ జొచ్చుటయే ఒంటె !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 727

ప్రాయ ముడిగి కూడ పారమార్థికచింత
చేయనట్టి మూఢచిత్తుఁ డెట్టి
అధమగతి కధీన మగునో యెఱుంగము !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 728

ఎందుఁ జూడ నుందు రింద్రియారాములు,
బుద్ధిరతుల సంఖ్య పోల్ప కొద్ది,
ఉందు కోట్లసంఖ్య నొక్కఁ డాత్మరతుండు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 729

జంతు విం(ద్రియముల, జనుఁడు బుద్ధివిలాస
మందు, దివ్యపురుషుఁ డవ్యయాత్మ
సక్తు లగుచు క్రీడ సల్పుచునుందురు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 730

జీవితంబు కామసేవల వెచ్చించి,
మరణవేళ* రాము శరణు గనుట
కొంప కూలునపుడు కూపంబు త్రవ్వుట !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 731

విషయరాశిలోని విస్తృత దోషముల్
గాంచి మనుజు డరతిఁ గనుట లెస్స;
ప్రబలు నరతిచేత బ్రహ్మవిజ్ఞానంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 732

విషయభోగసుఖము తృషను పెంపొందించు;
ఆత్మభుక్తి తృష్ణ నణఁచివేయు;
దప్పి తీర నేయి తగునె ! నీరము గాక !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 733

పంచదార పూయఁబడు చేదుమాత్రలు
విషయసుఖము లెగ్గు వెట్టకున్నె !
తేనె ముంచి నాక, తెగకుండునా కత్తి !
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర ! 734

* కామశరణుఁ దగుట. పాఠాంతరము.

చచ్చి పొందఁ దగిన స్వర్గాది సుఖముల
కంటె బ్రతుకునందె కాంచఁ జాలు
అవ్యయాత్మదర్శనానందము ఘనంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 735

మది విషాదజాడ్య మగ్నమైనప్పుడు
దైవచింతనంబె తగినమందు;
చిల్లగింజనీటి చెడుగుఁ బోకార్పదా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 736

నిఖిలజనులు చూడ నేరరు పరమేశుఁ,
జూడఁగలరు దేవుఁ జూచినట్టి
సాధుజనుల; నట్టి సచ్చరిత్రుల మైత్రి(ఁ)
శుభము లందవచ్చుఁ జుమ్మి మిత్రి ! 737

హృదయమందు దేవుఁ డెప్పుడు వసియించు;
హృదయ ముండ దట్టి లేశునందు:
శివునియందు మనసు చేర్ప తరింపనా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 738

జీవరూపమయిన క్షీరంబునందుండి
ఆత్మ యనెడి వెన్న నాహరింప
తత్త్వచింతనంబె త్రచ్చుట యగునోయి;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 739

పాంచభౌతికంబె పరమార్థమని నమ్మి
ఆత్మతత్త్వ మరయ దయ్యె జగము;
పరమసత్యమునకు పయనించుయోగమే
జగమునందు జీవచర్య; మిత్ర ! 740

లోకమునకు సర్వలోకేశునకు సుంత
భేద మెంచఁబో రభేదమతులు;
జగమునందు పరము సందర్శన మొనర్చి
ఉద్ధరింపఁజూతు రుర్వి; మిత్ర ! 741

బెల్లమును దినంగ బ్రియపడు నొక్కండు,
బెల్ల మగుట కొక్కఁ డుల్లసిల్లు:
బెల్లమయినవాని నెల్లరు పూజింత్రు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 742

శివునికరుణ నందఁ జేయు నొక్కఁడు పూజ;
శివునిఁ జూడ నొకఁడు చింతసేయు;
శివుఁడు కాఁగ నొకఁడు సేవించు యోగంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 743

చిత్స్వరూపనిష్ఠఁ జెందినయోగీశుఁ
డిట్టినడవడులఁ జరించు నంచు
పలుక నలవి కాదు పరమేష్ఠి కైనను !
విశ్వహిత చరిత్ర; వినర, మిత్ర ! 744

శాసనముల కేని, శాస్త్రావళికి నేని
అతఁ డతీతుఁ డగుచు అలరుచుండుఁ:
బ్రహ్మవిద్వరిష్ఠ భావ మందినవారి
వర్తనముల నెఱుఁగవచ్చు, మిత్ర! 745

సచ్చిదాత్ములకును సామాన్యమానవ
రీతి దాటి తా మతీత గతుల
చెలఁగుటొప్పు నదియె చిత్సుఖ మార్గంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 746

ముదిమియందు బ్రహ్మసదమలజ్ఞానంబు
పడయవచ్చు ననుట భావ్య మగునె!
బుద్ధిశక్తి యుడుగ పొందుదే జ్ఞానంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 747

సనకముఖ్యు లేమి, శంకరాదుల యేమి
లేతవయసునం దతీతమైన
బ్రహ్మవిద్య నెడఁద పండించుకొనలేదె!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 748

విగ్రహముల పూజ నిగ్రహంబును గూర్ప
నోపదేని నిష్ప్రయోజనంబు;
విగ్రహార్చ చిత్త నిగ్రహమునకెరా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 749

గంగ మునుఁగ మేనికల్మషమే పోవు ;
జ్ఞానగంగ మునుఁగ సకలజన్మ
కలుషరాశిఁ బాసి కాంతు బ్రహ్మత్వంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 750

చెప్పఁదగినవఱకె చెప్పినా రార్యులు
తత్త్వమర్మములను తఱచి తఱచి;
సమనుభూతిచేత సాధకు త్తెలియంగ
వలయునట్టి వెన్నో కలవు; మిత్ర ! 751

లౌకికములె పెక్కు లాకళింతకు రావు
పసులు చెప్ప, స్వానుభవము లేక;
పారమార్థికముల సార మెట్లను భూతి
లేక పొందఁగలవు లీల? మిత్ర ! 752

ఆత్మనిశ్చయంబు, నాత్మానుభవమును
పొంద కెవఁడు గాఁడు పూర్ణయోగి;
విన్న కన్న జ్ఞాన మెన్న అపూర్ణమే !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర 753

బ్రతుకు నెల్ల యోగపథముగా భావించి,
ద్వంద్వములను సమతఁ దాల్చి, చలికి
ఎండ వానలకు నొకింత కందని కొండ
సరణి నుండు, సిద్ధి కోఱలు; మిత్ర ! 754

ముక్తియనఁగ దేహముక్తి కాదుర, బాబు!
అరసి చూడఁగా "అహంతముక్తి"
సత్యమైన ముక్తి; సాధింపవలె దాని-
దేహ మున్న యపుడె తెలిసి; మిత్రి! 755

త్యాగిమహాశుకుండు, భోగి శ్రీకృష్ణుండు,
రాజులైన జనక రాఘవులును,
కర్మయోగియైన ఘనుఁడు వసిష్ఠుఁడీ
యైదుగురుని జ్ఞాను లంద్రు; మిత్రి! 756

తత్త్వశాస్త్రమందు తలఁ దూర్చి మతవిధుల్
తత్త్వవిద్య ఘనత దానఁ దగ్గె;
అందఱకును తత్త్వ మవసర మా విద్య;
కొందఱకె మతాలు గూర్చు; మిత్రి! 757

అధమ గుణము వీడి, అత్యుత్తమగుణాల
నభ్యసించి సుజనుఁడైనయట్లు,
తమమునుండి సత్త్వధర్మము న్నిజచిత్త
మందుకొనఁగఁ జేయ నగును; మిత్రి! 758

చదువురాని ధనికు చదివిన విజ్ఞుండు
తలఁచునట్లు, పరమతత్త్వ వేత్త-
చదివి తత్త్వ మెఱుఁగఁ జాలని పండితు
గుఱించి తలఁచుచుండు; పరమ మిత్రి! 759

మమతలేని ప్రేమ, మైత్రి, చుట్టఱికంబు
బంధకములు గావు-ప్రాజ్ఞు లెపుడు
స్వపరభేద ముడిగి, సమరసాత్మస్నేహ
పరత నుందు రొప్పు; పరమ మిత్ర ! 760

రోగి, వృద్ధు, శవము, త్యాగియౌ సన్న్యాసి!
గాంచఁగా విరక్తి కలుగు టొక్క
ముని కె కాదు; బుద్ధిమంతుల కేరి
కైనఁ గలిగి తీరు; నార్య మిత్ర ! 761

ఆవిరక్తి అపుడె అణఁగారి పోకుండ
నిలిచె నేని తత్త్వనిధులు వెదుకఁ
బూని మానవుండు బుద్ధత్వ మందును:
అణఁగిపోవ ఫలము సణఁగు; మిత్ర ! 762

నాది యనుట బంధనమునకు హేతువై
శోకమోహములను సుడులఁ ద్రోయు;
*నీది యనుట మోక్షనిధికి తావల మయి
†ఆత్మసుఖము నొసఁగు, నార్య మిత్ర ! 763

---

*నీది=ఇదియంతయు ఈశ్వరుడవగు నీదేయని భావము.

†పాఠాంతరము :- ఈశ్వరానుభూతి నిచ్చు మిత్ర !

అబ్బదెవ్వరికిని అద్వైత సంసిద్ధి
పెక్కు సాధనములు పెద్ద ప్రొద్దు
ప్రాలుమాలకుండ పాటించి చేయక;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 764

పొత్తములను వ్రాయ, పోరి నుపన్యాసముల్
సేయ, వేసములను వేయ నాత్మ
దర్శనమ్ము కాదు, తగు సాధనము లేక !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 765

బెల్లమనుచు నోటఁ బేర్కొనఁ మధురిమ
జిహ్వ కందునే భుజింపకుండ;
"నేను బ్రహ్మ" మన్న, నిర్వాణ మబ్బునా ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 766

చిత్తవృత్తులను నశింపఁ జేసినఁ గాని
అబ్బ దెవరికిని సమాధిసుఖము?
ఆత్మకేవలత్వ మనుభూత మగు నప్డు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 767

శివుఁడ నేనటంచు చిత్తశుద్ధిఁ దలంచి,
అర్హ సాధనముల నాచరింప
ప్రకృతి బంధరాశి బాసి విముక్తుఁడౌ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 768

ద్వంద్వములకు కట్టువడకుండ తనయందు,
నెల్లయందు తన్ను, నెల్లయదియు
*ఆత్మలోనఁ జూచు నతఁడు విముక్తుఁడౌ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 769

ఉప్పు కడలికంటె నొప్పు వేఱయినట్లు,
కాని కరిగిపోవు కడలిలోన;
ఆత్మ అట్లె బ్రహ్మమందు విలీనమౌ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 770

అణువుమొదలుగాఁగ అఖిల జగద్వస్తు
వితతి సృష్టి; దాని స్థితిగతులకు
మూలమేదో, ఆది మూలశక్తిఁ దాని
నెంచి, కాంచి, శంకడించు; మిత్రి ! 771

"నేను బ్రహ్మ మనుచు" నిత్య నిధిధ్యాస
మభ్యసింప బ్రహ్మ మగుదు వీవు;
ఉప్పుగల్లు కరగకుండునా కడలిలో !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 772

నిర్వికార పరమ నిర్గుణబ్రహ్మంబు
నే నటంచు యోగి జ్ఞానశక్తి
నభ్యసింపవలయు నవ్యయాగందంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 773

* ఆత్మ = తాను.

అరసి చూడఁ దా మహానందరూపుఁడే!
ప్రకృతి విక్రియలను బాఱఁద్రోల
అభ్యసింపవలసె నానందరూపత;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 774

"ఏను బ్రహ్మ" మన్న వృత్తియు క్రమముగా
అస్తమించు సచ్చిదాత్మలోన;
నీరు పాలఁ గలసి క్షీరమౌ చందాన !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 775

అల తురీయమందు ఆత్మమాత్రస్థితిన్
వెలుఁగుయోగి ప్రకృతి లలనబారిఁ
బడక ముక్తుఁడగుచు బ్రహ్మత్వమందురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 776

మాన్య మౌనె వేషమాత్ర సన్యాసంబు !
తలఁపు లెడఁదనుండి తొలఁగకున్న;
అభ్యసించు టొప్పు ఆత్మసన్యాసంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 777

ఏయుగమ్మునందు నేని రాగాదులు
జగము నేలుచుంట సత్య మరయు;
ప్రకృతి సిద్ధములకు పాటిల్లునే క్షతి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 778

ప్రకృతి గెలువనేర్చు సుకృతాత్ముఁ డొక్కఁడే
కామ రోషములను గడచి గెంటి,
ఆత్మసామ్యముగను అరయు జీవుల నెల్ల !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 779

గుణము లీవు గావు; గుణము లొనర్చెడి
కార్యములకుఁ గావు కర్త వీవు;
వాని వెలుఁగఁ జేయుపరతత్త్వమే నీవు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 780

ప్రకృతివికృతు లెన్న పరమాత్మ గాదను
జ్ఞాన మనుభవమ్ము సాధకులకు
శోకమోహరహిత సుస్థితి గూర్చును;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 781

ప్రకృతిగుణములకును పరునిఁగాఁ దన్నెంచు
నాత్మ తత్త్వవేత్త అఖిల దుఃఖ
రహితపదవి నంది రాణించు నిక్కంబు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 782

వస్తువులను విడిచి, వానిని గ్రహియించు
తెలివి నే నటంచు తెలిసికొనుట
తన్ను దా నెఱుంగు తత్త్వమం ద్రార్యులు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 783

జ్ఞానరూపమైన దాని నెఱుంగఁగా
జ్ఞాన మొకటి వేఱె పూనవలయు;
ఎఱుక యొకఁడె యాట నెటు సాధ్య మా పని !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 784

చూపఁజాలు వ్రేలు సూఁదిది నన్నింటిని,
తన్నుఁ జూపఁజాల దెన్నటికిని,
సర్వమును నెఱుంగు శాశ్వతాత్మయు నంతె !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 785

బాహ్యావస్తువులను పరికించుచుండియు
తన్నుఁ గాన లేని కన్ను వోలె,
అన్నిటిని నెఱుంగు నాత్మ తన్నెఱుఁగదు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 786

అనుభవస్వరూప మై వెలింగెడునాత్మ
ననుభవించు నింక అన్య మెద్ది !
గుడమునందు తీపి గూర్చునా యెవఁడేని ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 787

పిండి మొదలుగల్గు పెఱవస్తువులలోన
తీపిఁ జేర్చుగుడము; తీపి దాన
తీపి చేర్చవస్తు వేపగిదిని నుండు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర !. 788

మదిని గెలిచి యెల్లమమతలు తెగఁగోసి
విషయ సుఖములందు విరతి గాంచి
భూతకోటి నాత్మ భూతముగాఁ జూచు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 789

ఎట్టి తత్త్వవేత్త నేనియు సంసార
వాసనలు మొయిళ్ళు భానునట్లు
ఆవరించు, విడుచు, నద్ధాన క్షతి లేదు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 790

పరమతత్త్వవేత్త ప్రారబ్ధ కర్మంబు
అనుభవింపకుండ ననువు పడదు;
అజ్ఞుఁడంచు వాని ననుకొన్నలోటేమి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 791

జన్మకర్మలైన సంసార ధర్మముల్
నెఱపు నజ్ఞుఁ డెపుడు నిక్క మంచు;
ఆత్మవేత్త నటన యని వాని భావించు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 792

జానకీవియోగ జాతబాధను రాముఁ
డనుభవించు, నటకుఁ డనుకరించు;
అభినయించువాని కంటునా ద్వంద్వముల్ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 793

జ్ఞానసిద్ధ పురుషు సంసారజంబాల
పటల మంట దెట్టి పట్లనైన;
నేతిబిద్దు నాల్క నిలుచునా సుంతైన!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 794

జ్ఞానికర్మచయము జ్ఞానాగ్నిదగ్ధమౌ;
కట్టఁజాల దతని నెట్టి వేళ;
తగులఁబడినత్రాట నగునె బంధింపగ?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 795

తన్ను వెన్నఁ జేసికొన్నంత సంసార
మనెడి చల్లలోన మునుఁగుఁ గాక,
కలసి పోవ కందు వెలయును వేఱయి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 796

సూర్యచంద్రు, లగ్ని, సురలు, త్రిమూర్తులు,
భూతపంచకాత్మ భువన మెల్ల
నరునియందె వెలయు పరికింపఁ జాలిన;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 797

అభ్యసింప విద్య లలవడునట్టుల,
బ్రహ్మవిద్యకూడ పట్టువడును
అభ్యసనముచేత, అసమవైరాగ్యాన;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 798

చేరనీయకుండ జీవ ప్రాద్యవస్థల,
సత్వగుణము మదిని సవదరించి,
అభ్యసింపవలయు ననయ మేకాగ్రత;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 799

మడుగుస్వామి - రమణమహాని - తత్త్వానంద
పూజ్య పాద ముఖ్య పుణ్యచరిత
లుత్తమాధికృతుల కొజ్జబంతులు సూవె !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 800

బ్రహ్మవిద్వరిష్ఠ భవ్యలక్షణము లే
సాధుజనులపట్ల సార్థకములో !
అనుసరింప వారి నమృతత్వ మబ్బురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 801

అంతరాత్మయిచ్చునాదేశముల నెంచి
ఆచరించుశక్తి అలవడుటకు
పాటుపడెడువాఁడు పారమార్థికమార్గ
గామి యగుచు ముక్తిఁ గాంచు; మిత్ర ! 802

సర్వపూర్ణుఁడైన సచ్చిదాత్ముని (బోలి
సర్వపూర్ణసిద్ధి సంతరించి,
సర్వపూర్ణమైన శాశ్వత జీవన
స్థితిని బొందనౌ; ప్రసిద్ధ మిత్ర ! 803

వికృతు లెన్ని నిన్ను వెంటాడుచున్న, ఆ
వికృతులను జయించి స్వీయమైన
ప్రకృతి విడకుండ పరతత్త్వమై యుంట
సిద్ధియందు చరమసీమ; మిత్రి ! 804

శ్రవణపఠనములను జ్ఞానంబు పెంపొందు,
మననమునను బుద్ధిమహిమ హెచ్చు,
అధికభాషణమ్ము లనృతవాది నొనర్చు,
మౌనమునను శాంతి మలయు; మిత్రి ! 805

ఎల్లయందునున్న ఈశ్వరు హృదయాన
నుండె ననుచుఁ జెప్పు నోజ చూడ
తదుపలబ్ధి కదియె తగినచోటగుటయే !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 806

సర్వగతుని దేవు సాక్షాత్కరించుకోఁ
జాలఁ డెట్టి యోగిసత్తముఁడును;
హృదయగతుని దేవు నెఱిఁగి పట్టఁగవచ్చు
స్వస్వరూప మగుట పరమ మిత్రి ! 807

సర్వగతుఁడె దేహసంసర్గమునఁ జేసి
దేహబద్ధుఁ డగుచు తేజరిల్లె;
కాన దేహమందె కాంచనౌ బ్రహ్మంబు
నచ్చమైనరీతి; నార్య మిత్రి ! 808

సర్వగతునిమీఁద సాక్షాత్కరించు నీ
విశ్వమెల్లఁ గాన, విశ్వరూపుఁ
డనిరి విజ్ఞులతని; ఆ విశ్వమే ఆత్మ
అంచు నెంచి శంక డించు; మిత్రి! 809

నీవు తోఁచినంత నిఖిలంబు తోఁచును;
నీవు లేకయున్న నిఖిల మణఁగు;
నీవు నిన్నెఱింగి, నిఖిలంబు నీ వయి
అవ్యయామృతత్వ మందు; మిత్రి! 810

## వై రా గ్య ము

విషయసౌఖ్య మనుభవించెడు నాసక్తి
లేశమాత్రమేని లేకయుంట
కోరఁదగిన పరమ వైరాగ్యమునుగాఁగ
నెంచి దానికై యతించు; మిత్రి! 811

## బో ధ ము

ఎద్ది సంసృతిని నివృత్తి మొనర్చునో,
దేన బ్రహ్మతత్త్వ దివ్యఫలము
పట్టువడునో-అదియె పరమమౌ జ్ఞానంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 812

## ఉ ప ర తి

యమముఖాదులను సమాచరించుటచేత
విషయసేవనుండి విరతి గనుటె
ఉపరతిగఁ దలంచి, ఉన్మనీదశ కది
సూటిబాట యంచుఁ జూడు; మిత్రి! 813

ఆత్మ నే నటన్న అమల సుజ్ఞానంబు,
విషయసుఖ విరక్తి (ఁ) విస్తరించి;
మానసోపరతికి మార్గంబుఁ జూపురా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 814

మానసోపరమణ మానితానందమే
నిన్ను స్వస్థుఁ జేసి నిర్గుణాత్మ
నీవ యనెడు నిత్యనిర్మలాద్వైతంబు
నందుకొనఁగఁ జేయు; నార్య మిత్ర! 815

అష్టమంబు శతక మగుత శ్రీకందుకూ
ర్మల్లికార్జునునకు మహితమతికి
పరమహంసభక్తి పరునకు దాతకు
ధర్మరతున కంకితంబు; మిత్ర! 816

—*—

## న వ మ శ త క ము

వ్యావహారికంబు పారమార్థికమను
రెండుగతుల నడకలుండు జ్ఞాని
కాదిమంబు నటనయగు; రెండవది తథ్య
మనుచు తెలిసి మెలగు; మార్య మిత్ర ! 817

అమనస్క పంచదశి

తాను దృశ్యకోటి కా నని దిగఁద్రోసి,
దృక్కు తా నటంచు దివ్యదృష్టి
నమరి యుంట త్యాగ మగు నమనస్కాన;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 818

మాటలాడకుండ మది చిక్కఁబట్టుట
మౌన మగును: మాట, మది-కదలుట
కేపరాత్మ కతమొ, ఎప్పు డందు రమింప
పరమమౌన మద్ది; భవ్య మిత్ర ! 819

ఇంద్రియములు, వృత్తు లేగఁగా లే వెట
కట్టి యాత్మ ఒకటె యగు రహస్య;
మందు సంచరించునమనస్కయోగి-ఏ
కాంత దేశవాసి యగును; మిత్ర ! 820

కాల మెవనియందు కల్పింపఁబడె నట్టి
కాలకారణాత్మకళను-తన్ను
గా నెఱింగి యందు కరగెడు నమనస్క
సిద్ధయోగి సతము; శిష్ట మిత్ర ! 821

అన్ని బంధములకు ఆదిమూలము మాయ,
అట్టి మాయ దేని నరయ తెగునో,
ఆ పరాత్మతత్త్వమందు రమించుటే
మూలబంధ మగును; పూజ్య మిత్ర ! 822

ఇంద్రియములవృత్తు లెల్ల బ్రహ్మానంద
సాగరమున అలల సరణిఁ గలసి,
సచ్చిదాత్మయందు సమరస మందుటే
దేహసామ్య మిందు; తెలియు, మిత్ర ! 823

కనులనడుమ చూపు గదియింపఁడీ యోగి,
దృక్కు, దర్శనంబు, దృశ్యకోటి-
అనెడి త్రిపుటి యెచట నణఁగారి పోవునో
అదియె లక్ష్య మితని దగును; మిత్ర ! 824

దృశ్యజాత మెల్ల దృక్పరబ్రహ్మమం
చాత్మనిశ్చయంబు నంది యుంట
అగును యమమనంగ అమనస్కయోగాన;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 825

నామ రూప జాతి నానాగుణక్రియల్
లేని సచ్చిదాత్మ తా ననియెడి
జ్ఞాన మెల్లయపుడు సాధింప నేర్చుటే
నియమ మనెడి పరమనిష్ఠ; మిత్ర ! 826

దేహములను మాటి దేదీప్యమానాత్మ
తత్త్వమందు నిలిపి, తా నచలత
నలరుచుంటఁ జువ్వె ఆసనం బమనస్క-
యోగిసేవ్య మగుః విరాగి మిత్ర ! 827

జగము నెల్ల వెలికి చయ్యన రేచించి,
పూరకమున ఆత్మ(కా) బుద్ధి నిలిపి,
మానసమును బ్రహ్మమయముగా కుంభింప
ప్రాణనియమ మగును; పరమ మిత్ర ! 828

ప్రకృతినుండి కలుగు పలురీతుల గుణాల
నాత్మతత్త్వమున కనన్యములుగ
భావనం బొనర్చ, ప్రత్యాహృతి యనంగ
నద్ది మోక్షహేతు వగును; మిత్ర ! 829

ప్రకృతి పురుష తత్త్వ భావైకతాభ్యాస
మద్వితీయ నిస్తులాత్మతత్త్వ
మగుటకైన త్రోవ; అదియె ప్రత్యాహార
మగు నతీతయోగమందు; మిత్ర ! 830

ఎడఁద తాఁకునట్టి యే విషయమునైన
బ్రహ్మరూప మంచు భావమందు
తలఁచు టగును జుమ్ము ధారణాయోగంబు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 831

దృశ్యముల నెఱుంగు దృక్కు తా ననియెడి
నిత్యచింతనంబె సత్యమైన
ధ్యానయోగ మగుచు, జ్ఞానికి బ్రహ్మత్వ
సిద్ధిఁ గూర్చి, ముక్తుఁ జేయు; మిత్ర ! 832

జాగ్రదాది దశల సాక్ష్య సాధనముల
నెల్ల బ్రహ్మముగనె యెఱుఁగ, నిర్వి
కార నిర్మనస్క గాఢసమాధినై
మోక్షసిద్ధిఁ గూర్చు మునికి; మిత్ర ! 833

## ప్రపంచము

అస్తి, భాతి, ప్రియములగు బ్రహ్మరూపంబు;
నామ రూప కార్య నటన జగము;
ఈ "ప్రపంచ" శబ్ద మీ పంచకముచేత
సార్థకత వహించె; నయ్య మిత్ర ! 834

పంచభూతములను ప్రభవించుటంజేసి
పల్కినార లిది ప్రపంచమనుచు;
పంచశక్తి, లవల, పంచకృత్యంబుల,
పంచ విషయములను నెంచు; మిత్ర ! 835

ఇంద్రియములు నల్లి యేనయి యొప్పెను
జ్ఞాన-కర్మ భేద మూని; శ్రుతుల-
పంచఋషుల, కృష్ణుల, పంచజనావళి
నరయఁగలము గాదె ! పరమ మిత్ర ! 836

పంచకృత్యములును, పంచశక్తులు, మూర్తు,
లంగములును గాంచ నగుటఁజేసి
పంచసంఖ్యయొక్క ప్రాధాన్య మింతని
పలుకఁ దరము గాదు; పరమ మిత్ర ! 837

విశ్వకర్మ

ఇట్టి పంచకముల నీవిశ్వ మేర్పడ
విశ్వసృట్టు తాను విశ్వకర్మ
అనెడిపేరితోడ నైదుమోములతోడ
ఆదిదైవతముగ నయ్యె; మిత్ర! 838

విశ్వకర్మములను విస్తరించుటఁ జేసి
విశ్వకర్మ యనఁగ విశ్వసృట్టు
శ్రుతులఁ బొగడఁబడియె సూనృతోక్తులచేత;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 839

పూర్వఋషులు గూడ పొలిచినా రేవురై
పంచసంఖ్య తత్త్వ మెంచ, నట్లె
కాలుసేతులకును గలిగె నైదగువ్రేళ్ళు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 840

బ్రహ్మకేశవాది పదములకంటెను
విశ్వకర్మపదమె విశ్వసృట్టు
చేయుపనుల నెల్లఁ జెప్ప సమర్థంబు,
చింత చేసి చూడు చిరము; మిత్ర! 841

విశ్వకర్మ కైదు, విశ్వసవిత్రి గా
యత్రి కైదు, శివున కైదుమోము
లనుట విశ్వతత్త్వ మారయుటకెరా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 842

బ్రహ్మ, విశ్వకర్మ-పంచముఖాలతో
వెలసి రనరె తత్త్వవిదులు ఋషులు;
మూర్తి యొకటె, నామములు వేఱు భావింప,
వేద మిచట సాక్షి; వినర మిత్ర! 843

అగ్ని విశ్వకర్మ కమ్మ గాయత్రికి
లింగభేద మొకటె లే దితరము;
అందు కనిరె వార లైరి జగత్పితల్!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 844

పురుషసూక్తమందు పొగడికె గన్నది
విశ్వకర్మ యనుచు విశద మగును;
విశ్వకర్మ నాదివేదమే పొగడఁగా
అన్యములు నుతింపవా! సుమిత్ర! 845

చెప్ప లేదె మున్ను "శ్వేతాశ్వతరము"ను
"సర్వజీవ హృదయ సంస్థితుఁ డగు
విశ్వకర్మ నెఱుఁగ శాశ్వతామృతదశ
నందఁగలరు జను ల"టంచు—మిత్ర! 846

దశమమండలం బుదారవైఖరి తోడ
విశ్వకర్మమహిమ విస్తరించె;
స్తుతి యొనర్చె నాయజుఃకాండమును వాని
సర్వకర్మకరణ శక్తి; మిత్ర! 847

"విశ్వకర్మలేక విశ్వంబు లేదని
విశ్వకర్మదేవు విభవ మెల్ల
చాటలేదె తెల్గునాఁట నా మేమన్న !
వేత్త లా ననంగ; విశ్వ మిత్రి ! 848

సాయణుండు భాష్యసారస్వతమునందు
విశ్వకర్మ, త్వష్ట్రు, విశ్వరూప,
సానగాది ఋషుల సర్వశక్తుల నెన్ని
వ్రాసినాఁడు కనవె వాని ? మిత్రి ! 849

విశ్వకర్మ మొదటి విశ్వశిల్పిశుండు,
అగ్ని మిత్ర వరుణు లన్నె శిల్పు
లాబృహస్పతియును ఆకృతీశుండను
వేదవాణి వినవె ! విశ్వ మిత్ర ! 850

విశ్వకర్మపేర వెలసిన సూక్తమ్మ
ప్రథమవేదమందె పాదుకొనఁగ,
సర్వదేవతలకు స్రష్ట యాతనిపేర
*నుపనిషత్తు లుండవో ! సుమిత్ర ! 851

---

* నారాయణోపనిషత్తు కంఠెమ, విశ్వకర్మోపనిషత్తే మొదటి దనుట కీ యంశము ప్రస్తావింపబడినది.

విశ్వకర్మ దేవు విశ్రుతస్థానంబు
నాశ్రయించి దేవతాళి పెక్కు
రెన్నఁబడిరి శ్రుతుల నెన్ని యోరీతుల
ఆగమముల వెదకు మయ్య మిత్ర ! 852

మొదటివేదమందు వెదకిన నారాయ
ణాహ్వాయంబె దొరక దతనిపేర
పిదప మంత్రకాండ పెంపొందె నెంతయో !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 853

విశ్వసృష్టి యెల్ల విశ్వకర్మని శిల్ప
మగును; శిల్పి దాని ననుకరించి,
అపరవిశ్వకర్మ అని కీర్తితుం డయ్యె !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 854

త్వష్ట

విశ్వకర్మ తాల్చు వివిధావతారాల
త్వష్టరూపు తొలిది తథ్య మింత;
పురుషసూక్త మిచట పరమ ప్రమాణంబు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 855

ఆలుమగలఁ గూర్చిపెట్టె సత్సంధాత,
సర్వరూపసృష్టి సలుపు ప్రోడ,
దివ్యశిల్పి త్వష్ట అవ్యయామృతమూర్తి
బ్రహ్మరూపి కూడ పరమ మిత్ర ! 856

## విశ్వరూపుఁడు

త్వాష్ట్రివిశ్వరూప తత్త్వజ్ఞుఁ డింద్రపు
రోహితత్వమున నిరూఢుఁ డగుచు
ఆత్మసుతుల కొసఁగె నాపురోహితపద
గౌరవంబు శ్రుతులఁ గాంచు మిత్ర ! 857

అమరశిల్పకర్మ లాచరించుటఁ జేసి
కళలు బ్రాహ్మణార్హకర్మ లనుచు
చాటలేదె ప్రజకు; జ్ఞాన విజ్ఞానముల్
ద్విజత కుండఁదగిన విధులు; మిత్ర ! 858

అల బృహస్పతియును, ఆ విశ్వరూపుండు
శిష్టశిల్పు లగుటఁ జేసి కాదె
దేవగురువు లయిరి; తెలియక శిల్పంబు
గురుత నంద కొంప కూలు; మిత్ర 859

## గణపతి

ఆది పూజలందునట్టి యా గణపతి
బ్రహ్మణస్పతి యని పలుకు ఋక్కు;
త్వష్టసుతుఁడె సుమ్ము బ్రహ్మణస్పతి యని
పలుకు నొక్కఋక్కు; పరమ మిత్ర ! 860

త్వష్ట విశ్వకర్మతనయుఁడే యనియును,
ఇరువు రొక్క వ్యక్తియే యటంచు
శ్రుతులు, భాష్యములును నుతియించు చున్నవి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 861

గజముఖాది రూపకల్పన గణపతి
కాధునిక మటంచు నరయ లోఁచు;
వేదఋషులవాణి నాదరించి ఋతంబు
నవధరించు టొప్పు నయ్య; మిత్ర! 862

వేదములు

*బ్రహ్మ పంచవదన భాసితుఁ డగువేళ
పంచవేదములు ప్రపంచితములు;
నటకి ఒక్కతలను నాలుగు వేదాలె
అని వచించినార లయ్య; మిత్ర! 863

ప్రణవవేద మొకటి ప్రత్యేకముగ లేక,
ప్రణవమే సుపర్ణభవులచేత
జప్య మనిన నద్ది సర్వవిప్రాళి కు
పాస్య మగును గాదె! పరమ మిత్ర! 864

* బ్రహ్మ విశ్వకర్మలు అభేదస్వరూపులు. ఆ దేవుని పంచవదనములనుండి ఋగ్యజుస్సామాథర్వణ ప్రణవ వేదము లుద్భవించిన వని స్కాందపురాణ నాగరఖండాదు లనుచున్నవి.

అగుట పంచఋషుల కైదు వేదంబులు
కలవటన్నమాట కల్ల గాదు;
పంచ ముఖములకును పంచవేదంబులు
పుట్టియుండవా ? సుపూజ్య మిత్రి ! 865

పంచముఖములకును పంచవేదంబులు
ప్రాతినిధ్య మందబడుటకతన
పంచఋషులచేత పఠన పాఠన యోగ్య
తను భజించె నవి; యుదార మిత్రి ! 866

పరమతత్త్వవాది పంచమవేదంబు
శ్రుతిచతుష్టయమునఁ జొనిపినారొ !
అంతరించె నేమొ, ఔపనిషదవిద్యఁ
గలిపినారొ ! తెలియఁ గలమె ? మిత్రి ! 867

ఉంచు టెఱుఁగ మొక్క, ఉపనీతునకు పంచ
శిఖల విశ్వపితల శీర్షములకు,
పంచవేదములకు, పంచశక్తులకును
భవ్య చిహ్నములుగ; పరమ మిత్రి ! 868

బ్రహ్మాతలను గొట్టి పంచవేదములను
నాల్గు చేయఁగలిగినారు గాని,
పంచవేద లక్షణాంచిత శిఖలను
నాల్గు చేయఁగలిగినారె ? మిత్రి ! 869

బ్రహ్మపంచకంబు, బ్రహ్మర్షిపంచక,
మంశ, శక్తి, మూర్తు లాది గల్గు
బహుళపంచకములె ప్రవచించు వేదము
లయిదటంచు బ్రాజ్ఞు లరయ; మిత్రి! 870

కృత్యపంచకంబు కృత్యత్రితయ మయ్యె;
మూర్తిపంచకము త్రిమూర్తు లయిరి;
వేదపంచకంబు వేదముల్ నాల్గయ్యె
ఇట్టి మార్పు లెల్ల నెఱుఁగు, మిత్రి! 871

పంచఋషులపూర్వ భవ్యసిద్ధాంతాల
నేటఁ గలిపి, క్రొత్త లేవొ చెప్పి,
మనుజులందు సమత మ్రిందించి రేస్వార్థ
పరులో మొదటిపీట వలచి; మిత్రి! 872

పంచపీఠములు

ఆదిశక్తి యన, క్రియాశక్తి యన, పరా
శక్తి యనఁగఁ జ్ఞానశక్తి యనఁగ,
ఎంచ పంచశక్తు లిచ్ఛ యను శక్తితో;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 873

పంచశక్తులకును పంచపీఠమ్ముల
నేర్పరించి ధర్మ మెల్లరకును
చాటినారు మున్ను సానగాదులు ఋషు
లవ్వి మూడు మిగిలె; నయ్యొ మిత్రి! 874

వేదమాత యయ్యె విమల గాయత్రిగా,
ప్రార్థనీయయగా సరస్వతిగను,
అచల వందనీయ మైన సావిత్రిగా;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 875

ముగురు దేవతలకు మూఁడుపీఠమ్ముల
వింగడించి, రవ్వి విశ్వవిప్ర
వరులపాలనమున పరమధర్మప్రచా
రమ్ము చేసె ననవరతము; మిత్ర! 876

శంకరుండు పిదప శారదాదులపేర
పీఠములను నిల్పి, వేదవిధుల
జగతిలోనఁ దా ప్రచారమ్ము గావించె;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 877

ప్రౌఢదేవరాయపతి కొల్వునం దున్న
ముమ్మనార్య సుకవిముఖ్య వంశ
కలితు లైరి మాతృ గాయత్రిపీఠికి
పతులుగాఁగ చిరము, పరమ మిత్ర! 878

కవిఇతండు మాతృగాయత్రి పీఠికా
స్థానపండితుఁడుగ తత్త్వవిద్య
*మహిషరాష్ట్రమందు బహుళప్రచారమ్ము
చేసినాఁడు గాదె చిరము; మిత్ర! 879

* మైసూరు రాష్ట్రము.

షంస్తవార్హమైన సావిత్రిపీఠి శ్రీ
బసవదేశికేంద్రు పాలనమున
ప్రబలె పెక్కేండ్లు; రథకారబ్రహ్మత్వ
వేది యతీఁడు, వేదవాది; మిత్ర! 830

సాంబమూర్తి యనెడుస్వామి సరస్వతీ
పీఠపాలకుఁడయి వేదవిధుల
వెలయఁజేసె నంచు వివరించును చరిత్ర,
కాంచి నిక్క మెఱుఁగఁ గదర; మిత్ర! 831

జ్ఞానవిజ్ఞానములు — బ్రాహ్మ్యము

జ్ఞాన మనఁగ మోక్షసంసిద్ధికరము; వి
జ్ఞాన మనఁగ శిల్ప-శాస్త్రవిధులు;
శిల్ప-శాస్త్రసేవ సిద్ధించు నైహిక
సౌఖ్య సమ్మదములు; సాధు మిత్ర! 832

విజ్ఞులైనవారె విజ్ఞాన పదమున
కర్థ మనుభవ మని అనుచు నుండ్రు;
అట్టివారు భారతాది ప్రమాణమ్ము
లరయకుంట చిత్ర మయ్యె, మిత్ర! 833

*శిల్ప మధ్యయనము చేయఁగావలె విప్రుఁ
డంచు నుడివె భారతాగమంబు;
అవ్వి రెండు లేక అగున బ్రాహ్మ్యము పూర్తి?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 834

---

* "శిల్ప మధ్యయనం నామ వృత్తం బ్రాహ్మణ లక్షణమ్"—
ఈ వాక్యమిటీవలి ప్రచురణలలో నగపడుటలేదు.

శిల్పశబ్ద మిచటఁ జెప్పు విజ్ఞానంబు,
చేతఁ జేయుపనికి చిహ్న మద్ది;
అధ్యయనమనంగ నగుఁ జువ్వోజ్ఞానంబు—
గీత-భారతముల రీతి; మిత్ర ! 885

*విస్తరించుసుమ్ము—విజ్ఞాన మది యజ్ఞ
సమితి, సర్వకర్మచయము ననెడు
నుపనిషత్తుమాట కొప్పునా అనుభవ
జ్ఞానమనెడు నర్థసరణి ! మిత్ర ! 886

యజ్ఞకాండ సాంగ, ఆయాయి కర్మలు
విస్తరింప శిల్పవిద్య కాదె
కారణంబు తత్త్వమారసి చూడంగ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 887

శమము, దమము, తపము, జ్ఞానవిజ్ఞానముల్,
క్షాంతి, ఆర్జవంబు, సత్య శౌచ
దయలు గల్గువాఁడె తా బ్రాహ్మణుం డని
పలుకలేదె గీత ! పరమ మిత్ర ! 888

యజనయాజనాదు లనునవి బ్రాహ్మణ
కర్మలనుచుఁ జెప్పు ధర్మ మెన్న
స్వార్థకల్పితముగ నగపడు; నయ్యది
గీత చెప్పనట్టి రీతి; మిత్ర ! 889

* విజ్ఞానం యజ్ఞం తనుతే. కర్మాణి తనుతేఽపిచ" తైత్తిరీయానంద వల్లి. ౫వ అనువాకము.

శిల్ప మింత యేని చేయక, జ్ఞానంబు
పడయ కెవఁడు గాఁడు బ్రాహ్మణుండు;
అట్టులయిన గీత అనృత మాడిన యట్లె !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 890

బ్రహ్మ, సృష్టికర్మ పలురీతుల నొనర్ప
వాని సుతులు వివిధ వస్తువులను
సృష్టిచేయ కెట్లు చెప్పికొందురు "మేము
బ్రాహ్మణుల" మటంచు, పరమ మిత్ర ! 891

సానగాది పంచసంయముల్ విజ్ఞాన
మునకు, జ్ఞానమునకు పొత్తు గూర్చి,
ఇహాపరముల రెంటి కిల సేతువొనరించి
మంచితోవ చూపి రెంచు; మిత్ర ! 892

వేదమంత్రరాశి విజ్ఞానమును, జ్ఞాన
మైనయెడల, దాని నధిగమింప,
చదువ, ప్రజ్ఞయున్న సర్వులర్హు లటంచు
పూర్వఋషులు చెప్పి పోరె ! మిత్ర ! 893

శిల్ప మధ్యయనము చేయునాఁ డందఱు
విశ్వవిప్రు లగుచు వెలయఁ గలరు;
విశ్వమంగళమ్ము విస్తరించు టొకండె
మానవులకు నైజ మతము; మిత్ర ! 894

వైశ్యులకును, శమ్మువారికి వేదముల్
బోధ చేయరే ప్రపూతమతులు
విశ్వవిప్రు లఖిల విశ్వోపకారులై;
ప్రతిభ యున్న చదువవచ్చు; మిత్రి! 895

శ్రౌతకర్మ శూద్రజాతికే కాదు, విడ్
వర్ణమునకుఁ దగదు వసుధ నంచు
చెప్పినప్పుడా *నృసింహుండు యజ్ఞంబు
సలిపి వైశ్యయశము నిలిపె, మిత్రి! 896

మోమునందొకండు, ముంగాలనొక్కండు,
నొకఁడు చేతులందు, నొకఁడు తొడలఁ
బుట్ట లేదు వేద మట్టు వర్ణించుట
కావ్యదృష్టి యంచుఁ గాంచు; మిత్రి! 897

భరతవంశ జనులు భారతు లైనట్లు
క్రీస్తుభక్తు లైరి క్రైస్తవాళి,
బ్రహ్మపుత్రు లట్లె బ్రాహ్మణులగుదురు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 898

సర్వమానవులను సద్బ్రాహ్మణులఁ జేయఁ
బూనినట్టి ఋషులు సానగాదు
లగుట వారిత్రోవ నణచి రాధునికులు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 899

---

* బందరులో ఆత్మకూరి లక్ష్మీనృసింహశ్రేష్ఠి యజ్ఞ మొనర్చి సోమయాజియైన వృత్తాంతమును స్మరింపదగును.

వర్ణభేదబుద్ధి వర్ధిల్లిన దినాల
శ్రుతి కనర్హ మనిరి శూద్రజాతి;
ఇట్టి స్వార్థపరత యెంత విగర్హ్యమో!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 900

విశ్వకర్మఁదొట్టి విబుధులు తద్వంశ్యు
లిచ్చినారు బ్రాహ్మ్య మెందఱికినో;
సానగాద్యనాది సంయముల్ తొల్లింటి
గురుగణంబు సుమ్మె! పరమ మిత్ర! 901

శాపతప్తులైన సప్తర్షులకు బ్రాహ్మ్య
మొసఁగి విశ్వకర్మ ఉద్ధరించె;
వరలు నీచరిత్ర వైవస్వతపురాణ
భాగమందుఁ గనవె! పరమమిత్ర! 902

బ్రహ్మవిద్య నేర్పు పరమగురుశ్రేణి(౯)
సానగాద్యనాది సంయమీంద్రు
లగ్రగణ్యు లగుట ఆ బృహదారణ్య
కమునఁ జూడవచ్చుఁ గాదె, మిత్ర! 903

అధమజన్ములైన అత్యుత్తమగుణాలి
నంది యగ్రవర్ణు లైనవిధము
సత్యకాముఁడైన జాబాలి మొదలగు
వారికథలె చెప్పు; పరమ మిత్ర! 904

## రథకారులు:

రథము చేయువాని రథకారుఁ డందురు,
తనురథములఁ జేయు ధాత యెన్న
ప్రథముడైన పూజ్య రథకారుఁడగుఁ గాదె!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 905

ఎల్ల శిల్పములకు ఈ రథపదముప
లక్షణమ్ముగాఁగ లాక్షణికులు
చెప్పినారుగాన, శిల్పప్రపంచమ్ము
రథపదమ్ము చెప్పు; ప్రాజ్ఞ మిత్ర ! 906

విశ్వకర్మ మొదటి శాశ్వత రథకారుఁ
డతని సుతులు సృష్టి ననుకరించి,
తాల్చినారు పేరు ధరణిలో రథకారు
లనుచు సత్య మెఱుఁగ నగును; మిత్ర ! 907

అట్టి రథకరునకె ఆధానకర్మంబు
వేదవిధులయందు విశద మగును;
సంకరులకు నెట్లు శాసించు నాధాన
కర్మగౌరవంబు గాంచ, మిత్ర ! 908

సత్య మిట్టులుండ సంకరుల్ రథకారు
లనుచు వ్రాసినార లణఁప వారి;
వేదములను వీరు విశ్వజనీనులై
సంస్తుతింపబడిరి చదువు మిత్ర ! 909

భృగువు లెన్నఁబడిరి తగ రథకారులు
గాఁగ, సానగాది గణము నట్లె
అయిరి రథకరులుగ, అవ్వారి సూనులు
కారె రథకరులుగాఁ! గాంచు; మిత్రి ! 910

ఆద్యదంపతులను ఆదిమరథకారు
లంచు తథ్యమును వచించలేదె !
బ్రహ్మతీర్థు లెపుడొ భావించి తన జగ
చ్ఛిల్పమందు, కనవె ! శివ మిత్రి ! 911

ప్రవచనం బొనర్చె పారమార్థికరహ
స్యముల నెన్నొ తీర్థు లనుభవమున,
అరయు మొక్కసారి ఆ జగచ్ఛిల్పంబు
నిక్క మెఱుకపడును నీకు; మిత్రి ! 912

భృగువు మొదలుగల్గు పూర్వఋషీంద్రులు
రథకరులుగ వేదపథమునందు
ప్రస్తుతింపబడరె! పఠియింపు ఋగ్వేద
మెల్ల మర్మములను నెఱుఁగ, మిత్రి ! 913

విశ్వకర్మ ధర్మవిధి, విశ్వమానవ
ధర్మవిధమె అవితథముగఁ జూడ
కొందఱికిని యిద్ది కూర్చునట్టిది కాదు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 914

పంచఋషులు దీని పాటించి, రవ్వారి
సంతు ననుసరించె కొంతవఱకు;
సర్వు లనుసరింప సార్థకించును జన్మ,
విశ్వమంగళమ్ము వెలయు; మిత్రి ! 915

వృత్తివాచకములు విపరీతముగ వాడి,
శిల్పగౌరవంబు చెఱచి యవల
విశ్వకర్మజాతి వృద్ధి నడంచిరీ
సత్యమును చరిత్రి చాటు; మిత్రి ! 916

దేశచరిత నెన్ని తికమకల్ జరిగెనో
ఊహసేయఁ దోఁచు నున్ననిజము;
అధము లధికు లైరి, అధికులై రధములు
కాలపురుష చిత్రలీల(క) మిత్రి ! 917

పంచఋషులనాటి ప్రాథమికస్థితి
ఇట్టు లుండె ననుచు నెఱిగి ప్రజలు
విశ్వమనుజధర్మ విధులు తీరిచి నూత్న
సంఘమును సృజింపఁ జను; సుమిత్రి ! 918

బ్రహ్మసంతు గాన బ్రాహ్మణు లనియును
మనువిధానుసరణ మానవులని
విశ్వకృద్భవతను వైశ్యకర్మణు లని
పిలువవచ్చు నరుల విశ్వ మిత్రి ! 919

ఆదిమనుకృతంబు లైన ధర్మంబుల
నాధునిక మనుండు సాంతముగను
మార్చివైచె; నేటి మనుధర్మశాస్త్రంబు
ననుగమించె కడను వన్ని; మిత్ర ! 920

## వృత్తి వాచకములు

కర్మశాల గలుగ కర్మశాలి యనంగ
పేరువడసె శిల్పి భారతమున;
కర్మశాలి క్రమత కమసాలి, కంసాలి
యనగఁ బిలువఁబడియె నయ్య, మిత్ర ! 921

'అగ్నిశాలి' అట్లె 'అగసాలి,' అగసల,
'అవస,' ఔసల, నెడి ఆఖ్య లందె;
వృత్తివాచకములు వివరింప నివి యెల్ల
కులముపేర్లు గావు; తెలియు మిత్ర ! 922

త్వష్ట్రపదము నట్టె "తటాను"గా మారె
కర్మకార పదము కమ్మరిగను,
కాంస్యకార పదము కంసారు, కంచరి,
యనఁగ మాఱిపోయె; నయ్య మిత్ర ! 923

వర్ధకి యనుమాట "వడ్రంగి, వడ్లంగి,
వడ్ల, బఢయి" యనఁగ పరిణమించె;
"సూత్రధార" పదమె సుమ్మ "సుతారి"గా
వ్యవహరింపఁబడియె; నార్య మిత్ర ! 924

స్వర్ణకారపదము సాగె "సొన్నారి"యై
అదె "సునారు" హిందియందుఁ జూడ,
అర్కశాలి పద మ దక్కసాలిగ మాఱె,
వికృతి లివ్వి సువ్వె! విశ్వమిత్ర! 925

ప్రత్న శబ్ద మట్టె "పత్తారు"గా మాఱె
కన్నడమున; నిట్టు లెన్ని యొన్నొ
సంస్కృతాహ్వయములు సాఁగె వికృతులుగ;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 926

దేశభాషలందు దివ్యభాషాపద
జాల మిట్లు వికృతిపాలఁ బడఁగ
వాటి నెల్ల జాతివాచకములు చేసి
వాడ భావ్య మగునె ? పరమ మిత్ర ! 927

భాష పలువిధాల పరిణమించుటఁ జేసి
'బాపఁ'డయ్యెఁ గాదె 'బ్రాహ్మణుండు' !
బాపఁ డంచు పిల్వఁబడ డెందు విప్రుండు,
పెఱల వికృతి నేల పిల్వ ? మిత్ర ! 928

నవమ శతకమునకు నాయకుండౌఁగాత
పీఠపాలకుండు, వేదవేత్త,
అజసదృక్షుఁడు బసవాచార్యసంయమి
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 929

# దశమ శతకము
## లౌకికములు
### పత్రికలు

పత్రికలకు నెక్కు పామరుం డైనను,
ప్రాజ్ఞతముం డనంగ ప్రస్తుతిం గను;
పత్రికలకు నున్న ప్రాభవం బట్టిది !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 930

ఎంత శక్తి యున్న ఏ పత్రి కేనియు
వ్రాయకున్న కీర్తి వడయఁజాల
రాధునికయుగాన హరిహరాదులు కూడ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 931

పత్రికాధిపతులు పక్షపాతము వీడి
ప్రజల శ్రేయమునకు పాటువడక,
గుణమునకును చోటు కూర్పక యున్నచో
ప్రగతి కుంటువడును; పరమ మిత్ర ! 932

జనుల సత్పథమున సాఁగంగఁ జేయఁగా,
దోషరాశి నెల్ల తూరుపెత్త,
కార్యనిష్ఠఁ గూర్ప, కర్తవ్యమును జెప్ప,
పత్రికలదె ప్రథమపాత్ర మిత్ర ! 933

వ్రాయఁ గల్గువాఁడు, వడఁబోయఁగలవాఁడు,
సరసు, దధివేదిక, సామ్యయోగి,
పక్షరహితబుద్ధి పత్రాధిపతి యైన
ప్రజకు మేలు గూర్చు; పరమ మిత్ర ! 934

గుణము నెంచి, దోసఁగు కూలఁద్రోసెడివాఁడు,
సత్యశోధకుండు, శాస్త్రవేత్త,
సాధుశీలి-పత్ర సంపాదకుండైన
దేశగౌరవంబు దిద్దు; మిత్ర ! 935

పత్రికలను సతము పఠియింపకుండిన
తెలియఁబడవు జగముతీరు తెన్ను
లట్టుగాన పత్ర మాధునికయుగాన
ప్రథమపాత్ర మయ్యె; పరమ మిత్ర ! 936

పుస్తకములు చదివి పొందెడి జ్ఞానంబు
నంత పత్రికలనె అందవచ్చు;
కాన పత్రికాళి జ్ఞాననిధానముల్ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 937

పదవి

పదవివలన నరుఁడు ప్రస్తుతికెక్కును;
పదవి గాంచి జనులు భ్రమయుచుంద్రు;
పదవి లేనివాని పజ్జ కెవ్వరు రారు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 938

పదవి భోగమంచు పాటించు మూర్ఖుండు
విధులు మఱచి, స్వార్థనిధులు వలచి,
పదవి ముండ్లసెజ్జ భావింప బుధునకు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 939

పదవి మెట్టి, జనుల భ్రమపెట్టి, ధనరాశి
కూడఁబెట్టి, బందుగులకు మేళ్ళు
చేసి, లోకసేవ చేసితి నను కూళ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 940

పదవియం దొకండు బాంధవు డుండెనా
ఎట్టిచవట యాటలేని సాఁగు;
కోర్టు లెగురఁగొట్టు ఖూనికేసులఁ గూడ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 941

నీచుఁడైన, జనుల నిలువునఁ దోఁచెడి
స్వార్థబుద్ధి యైన, చవట యైన-
కలిని పదవి నంది ఘనతవహించురా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 942

పదవిఁ గోరు చెనటి బరి తెగించి చరించి,
తండ్రినైన నణుకఁ దారసిల్లు;
రాచవారిగాథ లీ చరిత్రలు చెప్పు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 943

పదవి నంద నరుడు పడనిపాట్లిల లేవు;
కఱచు పదవి కెట్టి గడ్డి నైన;
పదవిలోని తీపిపస యెట్టిదో కదా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 944

పదవి ఒదవువఱకు పలుబాస లొనరించి,
పదవి నందినంత పాడి తొరఁగి,
వఱతఁ గలుపునెల్ల వాగ్దానములు కూళ!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 945

పదవికోస మెన్ని పతాలనో మార్చు,
పదవి వలచి యెల్లపాట్లు పడును;
పదవికొఱకు తీయు ప్రాణాల నైనను;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 946

మంత్రిపదవి ఒక్కమారు దక్కిన చాలు,
నుత్తరోత్తరముగ నున్నతిఁ గని
ధన్యుఁడగును నేత తా నేటికాలాన !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 947

శాసనములసభకు సభ్యుఁ డైనను చాలు
గడన సేయఁ గొంత కలుగు వీలు;
ఏ పదవియు లేక యెటు తెల్లవారురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 948

ఏదో పదవి దొరకి, ఎవ్వరో కొందఱు
వారివెంట తిరుగువఱకు నిద్ర
పట్టఁబోదు నేఁటి ప్రముఖనాయకులకు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 949

మనుజసహజమైన మహిమను గోల్పోక,
పడయు వలయు నెన్ని పదవు లైన;
పదవి మానవతను పాఱఁద్రోలఁగ రాదు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 950

మంచివారి నెంచి మహనీయపదవుల
నుంచ దేశ మెంతొ ఉన్నతిఁ గను;
మలయజంబు తోఁట వెలయంగఁ జేయదా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 951

పదవి ఉత్తమునికి ప్రాప్తించుభాగ్యంబు
దేశమాత కున్న తీఱనట్టి
ఆపదలకు లోకు వౌదురా జను లెందు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 952

మంచివాఁడు పదవి మాన్యత కెక్కించు,
చెడ్డవాఁడు పదవిఁ జెఱిచి, చెడును;
పదవి నిర్వహించు బరువు తేలిక కాదు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 953

ఆ శ

ఆశచేత ప్రాణి అష్టకష్టము లందు,
ఆశచేత పాపరాశి పెరుగు,
ఆస దోస మెఱుగ దన్నమాట యెఱుగమే!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 954

పైరు తినెడునాసఁ బడు నేన్గు గోతిలో,
ఎఱను గోరి చేప మరణమందు,
మంటమీఁదియాశ మ్రగ్గును శలభంబు;
మూల మాశ కీడు మూఁడ మిత్ర ! 955

ధనముమీఁది ఆశ, దారపుత్రగృహాది
విషయరాశిమీఁది వెఱ్ఱి యాశ,
శాంతిఁ జెఱచి నరుని సంకటపెట్టురా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 956

పదవిమీఁది ఆశ, మదవతిపై ఆశ,
దొరతనంబుమీఁది దొడ్డ ఆశ,
ప్రాణగొడ్డములగు పనులఁ జేయించురా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 957

ఆస నిన్ను అన్యదాసునిఁ జేయును,
ఆశ గౌరవమ్ము హత మొనర్చు,
ఆశవలన చుల్క నగుదు జీవితమందు;
ఆసఁగోసి బ్రతుకుమోయి మిత్ర ! 958

సౌఖ్యమైన బ్రతుకు సాగమి కాశయే
మూలకారణంబు; ముప్పుఁ గూర్చు
నాశ విడిచి మనుజుఁ డానందమయుఁ డౌను;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 959

ఆశకన్ననున్, దురాశ ప్రాణములకే
గాసిఁ జేయుఁ గాన కలనుగూడ
అంతరంగమున దురాశను చోటీకు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 960

పాముచేత మ్రింగఁబడుచున్నకప్ప తా
మ్రింగఁజూచు నీఁగ మీఁదెఱుఁగక;
చచ్చునపుడుగూడ చావదార దురాశ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 961

ఆస వీడువాని కగు జగంబు తృణంబు,
ఆశలేమి మోక్ష మధిగమించు,
ఆశ గెలిచి నతని నర్చింతురు జనాళి;
విశ్వహిత చరిత్ర వినర, మిత్ర ! 962

కూడు, గుడ్డ, కొంప కూడినమానవుం
డంతమాత్ర తృప్తి నందకుండ
ఇంక నాశపడుట ఇబ్బందిపడుటకే !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 963

అల ముముక్షువైన, అయిన గృహస్థుండు
ఆంజనేయుతోఁక యనఁగఁ బెరుగు
ఆశ నంతరింపఁ జేసిన సుఖమబ్బు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 964

అనవసరములైన ఆడంబరములకు
'స్వస్తి' చెప్పుదేని సౌఖ్యమైన
బ్రతుకు సాఁగు, లేమి బాధింప దిసుమంత!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 965

మేరమీరు ధనము, మేడలు, మిద్దెలు,
ఇంద్ర వైభవంబు లెన్ని యున్న
కడకు కుడుచునవ్వి పిడికెడు మెతుకులే!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 966

గుప్పెడన్నమునను, గోచిపాతను తృప్తి
పడయలేక లిబ్బి వలచి నరుఁడు
దుష్కృతము లొనర్చు దొరకొని నశియించు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 967

గోచిపాత రక్షకోసమై సన్న్యాసి
పిల్లి, నావు, పొలముఁ బెంచి వరుస
పతన మొందలేదె పరమార్థదశనుండి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 968

స్వార్జితము

అప్పు చేసి యైన పప్పుకూడుం దిని
పట్టుపుట్టములను గట్టి తిరుగు
చెనటి తిట్టువడును శ్రీమతిం బిడ్డల
నలమటింపఁ జేయు నయ్య, మిత్ర! 969

వివిధ వస్తు వృద్ధి వెడలించు శాంతిని,
*క్లుప్తజీవితమున కొల్లలు శాంతి;
బ్రతుకు మిత మొనర్చి సతతామితానంద
సిద్ధిఁ గాంచి శివునిఁ జేరు; మిత్ర! 970

కాలు సేతు లుండి, కష్టించు బల ముండి,
పరుల నాశ్రయించి బ్రతుకఁ గనుట
నీచమంచు నెఱుఁగ నేరరే సోమరుల్!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 971

ఇతరు లొసఁగు నిష్ట మృష్టాన్నములకంటె
తా గడించు గంజి త్రావ మేలు!
అన్యు లిడెడు తిండి ఆనంద మొసఁగునా?
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర! 972

శక్తి గల్గువఱకు సంపాదన మొనర్చి,
అనుభవింప నేర్చి అనదలకును
సాయపడుట సువ్వె సజ్జన ధర్మంబు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 973

న్యాయ సమ్మతముగ నార్జించుకొన్నట్టి
మితహితాన్నములనె మెసవవలయు,
భోగలాలసతకు భుజియింప దోషంబు;
బ్రతుకుకొఱకు తినుట పాడి మిత్ర! 974

* క్లుప్తశబ్దము వికృతిగా ప్రయోగింపబడినది.

## సృ షి వి ం త లు

వెన్నెలను దినంగ వేడు జీవులు కొన్ని,
రాళ్లు దినెడు జీవరాశి కొంత,
సృష్టివింత లెంత చిత్ర విచిత్రముల్ !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 975

కూర్చె పెద్దపండ్లు గుమ్మడితీవెకు,
చిన్నపండ్లు మఱ్ఱిచెట్టు కిచ్చె;
దేవుఁ డెఱుఁగు సరిగ దేని కే దర్హమో !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 976

నింపె చెఱకు లోన నిలువెల్ల తియ్యన,
పండ్లు నిచ్చుశక్తి భంగపఱిచె;
ప్రకృతిమర్మ మేమొ పరికించి తెలియనా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 977

శైత్య సౌరభముల జగతి నాకర్షించు
మంచిగంధమందు మలయు చేదు;
సర్వ సద్గుణములు సమకూర వొకచోట
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 978

కప్రమునకు తీపి, కనకంబునకు తావి,
కపికి చక్కదనము కలుగఁ బోవు;
అబ్బ వన్యగుణము లారాట పడినను !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 979

పొట్టుదిన్న మాత్రఁ దిట్ట నర్హము కాదు;
గట్టి దానిఁ దినుటె ఘనత కాదు;
చిట్టు దినెడి పశువు చేయదా యుపకృతి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 980

కొమ్మలున్న చెట్టు కూర్పఁజాలును నీడ,
కొమ్మ లేని మొక్క కూర్పఁగలదె !
ఆశ్రయమునుబట్టి అందచుండు ఫలంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 981

వినయ మనెడు కల్పవృక్షంబు మనుజుల
కఖిల కార్య సిద్ధు లందఁ జేయు;
మఱువకుండ దాని మది నాటి పోషించుః
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 982

ఏనె ఘనుడ నంచు నెంచి యెవ్వారి నేని
చిన్నపుచ్చఁబోకు మెన్నడేని !
తాడిఁ దన్నువాని తల దన్నువాఁడుండు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 983

అడుసునందు కాలు నిడుట దోసముగాని
కాలిబురదఁ గడుగఁ గాదు తప్పు;
తప్పు దిద్దుకొన్న ఒప్పులకుప్పవే !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 984

మేలొనర్తు నంచు మిత్రురీతి నటించి,
కీడు చేయు నా నికృష్టుఁ డెన్న
బొడ్డు కోతు నంచు పొట్ట కోసెడిదాది !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 935

మంచి పట్టువడిన మానసీయుండగు,
చెడ్డ పట్టువడినఁ జెందు కీడు;
ఎరువు, చీడపురుగు లెటుచేయు వృక్షంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 936

కుడువకుండ నరుఁడు కూడఁబెట్టినసొమ్ము
మక్షికములు గూర్చుమధువు నట్లు
వాడుకొను నదృష్టవంతుఁడై నజనుండు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 937

అన్నదమ్ములట్టు లఖిల మానవజాతి
మెలఁగి ఒకరి కొకరు మేలుఁ గూర్పఁ
బూనుకొనిరయేని భువి స్వర్గమాఁగదా !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 988

భక్ష్యవస్తువందుఁ బడి చచ్చియును ఈఁగ,
వాంతి గలుగఁజేసి బాధ పెట్టు;
ఖలుఁడు చచ్చి కూడఁ గావించుఁ గద కీడు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 939

స్త్రీని పురుషునట్లు, స్త్రీఁగాఁగ పురుషుని
మార్చు నేఁటి శాస్త్ర మహిమవలన
నీటఁ దిరుగు చేఁప నింగిఁ జరింపదా?
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 930

పరిమళముల దిశలఁ బర్వఁ జేయునె గాని
పూచి కాచి యిడదు పూలు, పండ్లు
చందనద్రుమంబు చర్చింప చిత్రంబు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 991

సతులు, సుతులు, హితులు, స్వజనముల్, చుట్టాలు
పెట్టినన్నినాళ్ళె ప్రియులు నీకు;
పెట్టి పోయకున్న, తిట్టిపోయుదు రోయి!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 992

పెట్టిపోయనపుడు తిట్టిన తిట్లనీ
పెట్టుచున్నఁగాని పెట్టఁ డంచు
తిట్టుచుట్టములకు పెట్టినన్ వ్యర్థమే!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 993

పెట్టవచ్చు తాము, పెట్టించుకొన వచ్చు,
ఇచ్చి పుచ్చుకొనుట లెందు మేలు;
పెట్టనేర్వకుండ పెట్టించుకొన కీడు!
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర! 994

పెట్టఁజాలకున్న పెట్టలేమికి మది
చింత పడుదువేని అంతె చాలు,
పెట్టువారు దాన ప్రియపడి మెత్తురు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 995

నేలఁ గలయుతాను నేలనేలఁ దలంచి
చేయరాని పనులు చేసి ప్రజకు
నాశమును ఘటించు నరుఁడెంత మూర్ఖుడో !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 996

కూపజలము వాడుకోలేఁది నూరుచునుండు,
దాన మొసఁగ ధనము తనరు నట్లె;
ఈవి లేక యవ్వి ఇంతైన పెరుగవు !
విశ్వహిత చరిత్ర వినర, మిత్ర ! 997

వాన కురియునపుడె పూనఁగావలె పాత్ర,
వలసినపుడు పడదు వాన; అటులె
అద నెఱింగి పనుల నాచరింపఁగవలె;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 998

ఖలునియందు మంచి గాలించి చూచినన్
గోచరింపఁ బోదు కొంచె మేని;
ఒంటె దేహమందు నుఱుకునా సొగసింత !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 999

దోసఁగు చూపి రంచు దూషింప కొరులను,
తప్పు దిద్దుకొనుము; దర్పణంబు-
మొగము ముఱికిచూప పగులఁగొటుదె దాని!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 1000

ఇరులఁ దిట్టుకొంచు నేల కూర్చుండెదు
చిన్ని దివ్వె నేని చేతఁ దాల్చి
దారి సాఁగిపొమ్ము దాపౌను గమ్యమ్ము !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 1001

గోవు గడ్డిమేసి కుడితినీటిని ద్రావి,
పాల నెల్ల నొగుల పా లొనర్చు;
మనుజ జాతికన్న మాన్యమా పశుజాతి !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 1002

పగతు విషయమందు పగ చూపకుండుట
గొప్ప గాదు; వాని ముప్పు లుడిపి
ప్రేమ చూపువాఁడురా! మహామనుజుండు!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 1003

గొప్ప దైన దెల్ల కోరగాఁ దగ దౌన!
పాలు నీటికన్న మేలె అయిన,
నీట బ్రతుకుచేఁప నిలుచునా పాలలో !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 1004

భూతకాలఫలమొ పో వర్తమానంబు,
భావికైన బీజపంక్తు లిందు
ఇమిడియుండుఁ గాన నీ సంధికాలంబు
వ్యర్థపుచ్చఁబోకు; మార్య మిత్ర ! 1005

సుఖము పంచుకొనఁగఁ జూతురు పల్వురు,
కష్టపడఁగ నెవ్వ రిష్టపడరు;
కష్టపడక నీకుఁ గల్గునా సౌఖ్యంబు !
విశ్వహిత చరిత్రి, వినర, మిత్ర ! 1006

భావి నెట్టిఫలము బడయంగఁ గోరుదో
అందు కర్హమైన యట్టి పనులె
చేసి తత్ఫలముల జెందుము ధీరత
విఘ్న లౌననంగ; విశ్వ మిత్ర ! 1007

వృద్ధి పొందుకొలఁది విజ్ఞానశాస్త్రంబు
క్రొత్తసుఖము లెన్నొ కొఱలుచుండె;
బుద్ధినుండి ప్రాఁత పోవలేదిసుమంత,
ఎట్లు నవసమాజ సృష్టి మిత్ర ! 1008

'నేను, నాది, పోయి నిలువగావలె నింక
'మనము, మనది' యనెడుమాట, వాటి
స్థానమందు నపుడె "జయజగ"త్తనియెడు
సూక్తి సత్యమగును జువ్వె మిత్ర ! 1009

ఓ ర్పు

ఓర్పునందు నున్న ఉన్నతోన్నత శక్తి
సాటిలేని దనుచు చాటె క్రీస్తు;
ఓర్వ నేర్చినాఁత డుర్వియెల్ల జయించు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 1010

చిట్టుబుట్టు మనుచు చేఁజేత కార్యంబు
చెఱచు కోపి; శాంతి శీలి యెన్ని
కష్టములనో ఓర్చి కార్యంబు సాధించు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 1011

భూమిజనని క్షమకు పూర్ణోపమగఁ జెప్పె
నార్యవాణి, కల్ల యగునె అద్ది !
క్షమను కత్తిగాఁగ కరమునఁ దాల్చిన
త్రిజగములను గెల్చితీరు మిత్ర ! 1012

నే ర్పు

నేర్పుచేత కార్యనికరంబు సాధించు
బుద్ధిమంతు డెపుఁ డపూర్వశక్తి
నేర్పునందు నిలిచి నిను తీర్చు విజయిగా;
నేర్పులను గడించి నిల్వు; మిత్ర ! 1013

నేర్పు గల్గువాడు నిర్ధనుండైనను,
నిస్సహాయుడైన, నీచుఁడైన
నేర్పుకల్మి జగము నిజవశంబుగ జేసి
సుఖపడంగఁ జాలుఁ జువ్వె; మిత్ర ! 1014

సృష్టియొక్క బాహ్యచిహ్నముల్ వివరించు
శాస్త్రమొకటి, లోని సత్యములను,
తెలుపు శాస్త్రమొకటి; తొలిది విజ్ఞానమహా;
మలిది ఆత్మవిద్య; మాన్య మిత్ర! 1015

ఆత్మవిద్యతోడ ఐక్యమై విజ్ఞాన
మఖిల మంగళముల నందఁజేయు;
వేఱుపడినఁ జెడును విశ్వకల్యాణంబు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర 1016

దుష్టశక్తు లెపుడు శిష్టశక్తులఁ గప్పి
మనుజు మంచితనము మంటఁ గలిపి,
సత్క్రియల నొనర్పు సంకల్పముల నీఱ
అధమగతుల కీడ్చు నయ్య, మిత్ర! 1017

దిక్కు తోఁచనట్టి చిక్కులఁ మనుగడ
చిక్కినపుడు శాస్త్రచింతనంబు
తిమిరమందు దివ్వెతీరు దారిని చూపు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 1018

ఒరుల కుపకృతులను ఒనరించి కలనైన
తలఁపరాదు వాటి ధార్మికుండు;
మేలు పొందినతఁడు మేలొనర్చినవాని
మఱువఁగూడ దెపుడు; మహాత్మ మిత్ర! 1019

ఒరులు పొగడినంత నుబ్బి తబ్బిబ్బయి
ఘనుఁడ నయితి నంచు గర్వపడక,
ఇంకమంచిపనుల నెన్నిటినో చేసి
పరుల కుపకరింప వలయు; మిత్ర! 1020

అబ్ధియంత హృదయ మాతని దందులో
తనకు పరులొనర్చు తప్పిదముల
కింత చోటు దొరక దెల్లరిసుఖశాంతు
లభిలషించు సుజనుఁ డతడు; మిత్ర! 1021

పరుల మోసగించుపని చేయగారాదు,
పరులు మోసగించుపట్ల వారి
మోసములను బడక నోసరిల్లుటలోన
మెలకువను వహించి మెలగు; మిత్ర! 1022

పనుల ననుసరించి ఫలము చేకూరుట
ప్రకృతిసిద్ధ ధర్మపథము సూనె!
విత్తుఁబట్టి కాదె వృక్షంబు ఫల మిచ్చు;
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 1023

ఒరుల కిచ్చినట్టి దుండు నీకొఱకయి;
నీవు తిన్న దెల్ల నేలపాలె!
కాన శక్తికొలఁది దానంబు సేయనా!
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 1024

బ్రతుకు కష్టదశల పాలయి సుడియుట
ఉత్తమునిఁగ నిన్ను నొనరుచుట కె;
పసిడి పుటములోన నెసఁగదా మేల్మియై !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 1025

ఒరుల కెంత మేలు నొనరించిననుగాని,
ప్రతిఫలంబు కోరవలదు సుంత;
వర్ష మొసఁగుమబ్బు వాంఛించునె ఫలంబు !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర! 1026

ఒరులబాగు చూచి ఓర్వఁజాలనివారు
పలువు రుండవచ్చు, పరుల ఓగు
చూచి బాధపడెడు సుజనుఁడేయొక్కఁడో !
విశ్వహిత చరిత్ర, వినర, మిత్ర ! 1027

ఉపకృతులను బొంది యొకఁడు కృతఘ్నుఁడే
యగుచు గాక! వాని కవసరమున-
మఱల మేలుసేఁత మానవోత్తమధర్మ
మనుచుఁ దలఁచుమెప్పు డార్య మిత్ర ! 1028

ఎవని మంచి చెడులకే యే ఫలములు సం
ప్రాప్త మగునో యవ్వి యతని కర్మ
ననుసరించి వాని కబ్బుచుండుట నీవు
మంచినే యొనర్చు; మాన్య మిత్ర ! 1029

ఒరుఁడు నీకు చెడ్డ నొనరించెనా, దాని
ఫలిత మతఁడెపొందు, వాని కీవు
చేసినట్టి మంచి చేయును నీకు మేల్;
కర్మ నిష్ఫలంబు గాదు; మిత్రి! 1030

తల్లి పార్వతమ్మ, తండ్రి శ్రీకోటీశ్వ
రార్యుఁ; డేను రాఘవాహ్వయుండ-
ప్రత్నగోత్రభవుఁడ, బ్రహ్మభూతప్రస
నాత్ముఁడను; ప్రబోధితాత్మ మిత్రి! 1031

జీవితంబు పండఁ జెప్పితి నీవేయి
పద్యములను సుకవి పండితజను
లాదరించి మెచ్చ నఖిలహితార్థినై
విశ్వహిత చరిత్రి, వినర, మిత్రి! 1032

వేదశాస్త్రవేది, విజ్ఞాని, కవి, శిల్పి
వడ్డెపాటివంశవార్ధి విధుఁడు,
మాఘమహిమ కర్త,మానిరంజినశాస్త్రి
కిత్తు దశమశతక మిద్ధ మిత్రి! 1033

బ్రతుకు వెలుఁగుబాటఁ బట్టి సుఖింపను,
బుద్ధి శాంతిసుఖము పొందుటకును,
విధి వివేక మెడఁద వెలసి సంస్కృతిఁ గూర్ప-
చదువు మిత్రి, మిత్రిశతకములను! 1034

సమాప్తము

—o—

## పరిగ్రహము

అప్పుడెప్పుడో తొలుత ఐహికాముష్మిక
మార్గములను ధర్మమర్మములను,
చిన్ని పద్దెములుగ చెప్పిన వేమన్న
లాఘవంబుఁ జూపె రాఘవన్న;

మేలి బ్రదుకు తెఱువు మెలిపెట్టి తత్త్వార్థ
సారమెల్ల వేయిసార్లు పిండి
ఆటవెలఁది గుండెలందెల్ల తెగనింపి,
ఏలుకొనుఁ డటంచు ఇచ్చె మాకు.

మామ తనదు కన్యకా మహాదానంబు
"రక్తి కొఱకు కాదు; ముక్తి" కనియె!
ఆత్మసుఖము జుట్టుటటులుంచి పరికింపఁ
గా, ఋణంబు నంటగట్టె మాకు.

అద్వితీయుఁడ నయి అపరాశఁ గెంజాయ
లాస చేసి నడచునట్టి నన్ను,
చెప్పపెట్ట కుండ చిటికెలోపల నిట్టె
సద్వితీయుఁ జేయ సాహసించె!

ఎట్లు మెచ్చవలఁతి నీరీతి చెయిదంబు,
మోయవలసె బరువు ముదిమి నింక;
ఆటవెలఁదులార! అంతరంగస్థలి
ఆడి పాడి *తన్మయతల నిడుఁడు.

—పులివర్తి శరభాచార్యులు

* తన్మయత=బ్రహ్మమయత, బ్రహ్మత్వము.

# కబీరు భావధార

భద్రాచల సీతారాముల సన్నిధిని 11-1-"76 న భక్తకవి సమ్మేళనములో కబీరుగా ఆవిష్కరించిన కవిత.)

రామానందుని శిష్యుఁడ,
కామాదుల గెలిచి భవము గడచినవాఁడన్
రాము రహీముని ఒకటిగఁ
బ్రేమించిన సన్మతిని 'కబీర్దాసుండన్.' 1

అల నిరంజనమైన అమలతత్త్వంబె నా
దైవత మ్మటంచుఁ దలఁతు వాని;
హిందు ముస్లిములన్న యెట్టి భేదమ్ము వాని
దృష్టిలో లేదు వాదింప నేల ?
వ్రతములనేన్, మొహరమ్ముల నేనియు,
పూజాదికముల,నమాజు చేయ,
ఈరెండు మార్గాల చేరని మూఁడవ
త్రోవ నాదియ జనస్తుత్య మిద్ది,
ఆ నిరాకారు తత్త్వమ్ము నంతరంగ
మందు నిల్పి రహస్యమ్ము నరసినాఁడ,
కాశికిని గాని, యవల మక్కాకుఁగాని
పోఁదలంప నిరంజను పొందినాఁడ. 2

దేవుఁ డెట్టివాఁడొ తెలియఁజాలవు సుంత
మాలఁ బూని చేతు, మంత్రజపము,
హృదయమందు కపట మింతైన తరుగదు;
దేవుఁ డెట్లు నిన్ను తేర్చునోయి! 3

అఱచు ముల్లా పెద్ద
చెవిటివాఁడటోయి, చెప్పు ప్రభువు ?
చీమకాలియందె చిఱుమ్రోఁత వినుఁగవా :
వినుఁడు శ్రీకబీరు విమలబోధ. 4

అద్దమందు ముఖమె అగపడురా బాబు :
మనసు మంచిచెడులు కనఁగ రావు;
మంచిచెడుల రెంటిఁ గాంచును దేవుండు;
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 5

మట్టికుప్పలోన మాణిక్యమున్నది
కనులు తెఱచి వెదకి కొనర తండ్రి;
మట్టి సొగసు గాంచి మఱువ కద్దానిని;
వినుఁడు శ్రీకబీరు విమలబోధ. 6

ఎల్లరూపులందు ఎసఁగెడి పరమాత్మ
వనిత గాదు, పురుషవరుఁడు గాఁడు;
ఇంద్రియములకంద కెసఁగెడి ఘనశక్తి,
వినుఁడు శ్రీకబీరు విమలబోధ. 7

ఒకటి నెఱుఁగలేక ఉన్నవన్ని యెఱుంగ
ఏమిలాభమీ యనేకమునకు
ఒకటి మూలమనెడి యుక్తి నెఱుంగరా :
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 8

అడవి కుటీకినట్టి ఆ ఋశ్యశృంగుని
మాయ వెంటఁ దగిలి మరులు గొలిపె;
గురుని శరణు చొచ్చి తరియింత్రు కొందఱే :
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 9

పొట్టు నెగురఁగొట్టి గట్టిగింజలఁ బట్టు
చేటవంటివాఁడు శిష్టజనుఁడు;
సారముం గ్రహించి సారహీనము వీడు:
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ, 10

కత్తి పట్టి పోరు ఘనుఁడు శూరుఁడు గాఁడు:
మాయ గెలిచి భక్తి మసలు వాఁడె;
మేటి శూరుఁ డనఁగ మించుగా, జగతిలోఁ
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 11

జందెమును ధరించి పొందనేల ద్విజత్వ ?
మవల దాని వీడు నాస్థ యేల ?
అడుసు త్రొక్కనేల ? అడుగు కడుగనేల ?
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 12

బ్రహ్మరూపమంచు ప్రస్తుతించినకూడె
ఁ నకులాల యింట నారగింప
కులము చెడునటంచు కూర్చిరి శాస్త్రిలు;
వినుఁడు, శ్రీకబీరు విమలవోధ. 13

శుచియు, రుచియు. స్వాస్థ్యసూత్రానుకూలత
మరియున్న, ఎవరి అన్నమైనఁ
దినఁగవచ్చు దాన దెప్పరముండదు;
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 14

ముల్లుపెట్టి గ్రుచ్చు మూర్ఖుని సైతము
పూలపూజ చేసి పొందు ఘనత;
ఇచ్చు తగినఫలము లీశుఁ డిర్వురకును;
వినుఁడు, శ్రీకబీరు విమలవోధ. 15

కాగితములు చదివి కథలు చెప్పెదునీవు,
కనుల, మదిని నిజము గని వచించు
నాకు పొత్తుకుదురునా పండితాగ్రణీ!
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ। 16

వేల గ్రంథములను విసువక చదివినఁ
ఒకనికేని జ్ఞాన మొదవఁబోదు;
ప్రేమతత్త్వ మెఱుఁగ పెంపొందు జ్ఞానంబు:
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 17

మనసుమైల తుడుచు మందు వాడక యేవొ
తీర్థములను మునుఁగ సార్థకతయె।
మీను నీట నుండు, మేనెల్ల చెడుకంపె!
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 18

వర్తమాన మొకటె వరణీయ మనుకొను,
గతము గూర్చిపొగడుగతికి లోఁగ!
అనుభవమున సత్యమావిష్కరించెద;
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 19

నాది యన్నదొకటి లేదు జగత్తులో,
నీవెయున్నదంత నిజమెఱిఁగిన;
నీది నీవు నీయ, నాదేమి పోవురా!
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 20

కనులు మూసికొన్న కనిపించెదవు నీవె!
అన్య మేమి చూడ నపుడు నేను;
నిన్ను చూడనీయ నన్నుగా కితరంబు;
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 21

సగుణ నిర్గుణములు, సర్వప్రపంచంబు,
ఆస్తికత్వ మేని, నాస్తికత్వ
మేని మనసుపన్ను నింద్రజాలమె సుమీ!
మనసు కీలెఱింగి మనఁగదన్న! 22

సగుణ నిర్గుణములు సన్మార్గములె యైన
సగుణ పథముకన్న అగుణపథమె
ఆదరించినాఁడ ఆత్మసంస్కృతిఁబట్టి;
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 23

మత మదెట్టిదైన, మతి మంచిదగునేని,
రాముఁడైననేమిరా, రహీముఁ
డైననేమి, మనసు నర్పింప తరియింతు;
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 24

వారణాసి యనఁగ వఱలు భ్రూమధ్యంబు,
పరము నచటఁ గాంచి పడయు ముక్తి;
కాశియందుఁ జావ కలుగునా మోక్షంబు?
వినుఁడు, శ్రీకబీరు విలమబోధ. 25

నాగృహంబుఁ గాల్చి సాఁగితి నావెంట
వచ్చువారి యిండ్లు వరుసఁ గాల్ప,
ఎంద అనుసరింతు శీకబీరుని త్రోవ?
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 26

మద్య మాని, మేను మఱచి చరించెడి
మాకు జగముతోడ మైత్రి యేమి?
బంధములనుద్రెంచి పడసినారము స్వేచ్ఛ;
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 27

పెద్దవాని వెదుక చేసితి యత్నంబు,
దొరకలేదు పెద్దనరుఁ డొకండు;
పెద్దలెల్ల నాదుచిత్తమందునె యుండె;
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 28

మూఁగవానిసైగ మూఁగయే యెఱుఁగును,
జ్ఞానిసుఖము నల్లె జ్ఞాని యెఱుఁగు ;
ఒరుల కవ్వి రెండు ఊహింపఁగాఁదురా ;
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 29

అన్నిచోట్ల నుందు రాచారవంతులు,
లేరు వెదకినను, విచారవంతు,
లెంత గొప్పవాఁడొ ఈ విచారణశీలి ;
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 30

ఉల్లమందు తూఁచి ఉచ్చరించినమాట
కలవి కాదు సువ్వె విలువఁగట;
వదలుఁబోతు లురక వాగిన నేమౌను ;
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ. 31

ఆలుబిడ్డ లేని, ఆత్మబంధువు లేని,
ధనము, గృహము-వెంట తరలి రావు;
ఎందుకట్టె యొకటె యేతెంచు నీవెంట ;
వినుఁడు, శ్రీకబీరు విమలబోధ, 32

శ్లో॥ నాస్త్యసత్యసమం పాపం, నాస్తి సత్యసమం తపః
సత్యశీలస్య హృదయే భగవాన్నివసతి ధ్రువమ్॥

అందనివస్తువు లందఱు విడుతురు,
చేత నున్నది యిచ్చుదాత త్యాగి,
పంచకల్యాణిని పఱపుట సులభమే,
దుడుకుగుఱ్ఱము నెక్కదొరయె రౌతు,
లోకానుభవమును వాకొను నరుకన్న
స్వానుభవము చెప్పునతఁడు ఘనుఁడు,
అడవుల కేగి సన్న్యాసిగా మనుకంటె
ఇంట విరాగిగా నుంట మేలు,

ఉండవే యింట భోగముల్ యోగములును
వెదకి సద్గురుమూర్తి సేవించె దేని,
అమల దివ్యామనస్క సమాధిసుఖము
చూఱలాడెద వంచు కబీరు పలుకు. 34

అద్వితీయమైన ఆ పరమాత్మలో
ఆత్మ, ఆత్మయందు నలరు మాయ,
చిన్నగింజఁ జెట్టు, చెట్టు క్రిందను పీడ
వెలయురీతి నని కబీరు పలుకు. 35

అక్షరాతిగామి యగుతత్త్వమందుండి
అక్షరుండు, నతని యందునుండి
క్షరుఁడు పొడమె, శూన్యగగనాన చుక్కలు
వెలయునట్టు లని కబీరు పలుకు. 36

విత్తు, చెట్టు, కొమ్మ, విరులు, పండ్లాకులు-
అన్ని విత్తొకండె యైనయట్లు,
అన్ని రూపులందు ఆ నిరాకారుఁడే
యని కబీరు పలుకు నన్నలార! 37

ప్రాణమును, మనస్సు, పాడగు దేహంబు,
జీవుఁడును పరుండె భావ మరయ,
భేదబుద్ధి వీడి సాధన చేసిన,
అబ్బు మోక్షసిద్ధి యను కబీరు 38

నిన్ను నీవు దెలియ తెన్నుగన్పడు దాక,
వదలిపోవు నిన్ను వట్టిభ్రమలు;
నిన్ను నీవెఱింగి నిత్యనిరంజన
తత్త్వమయిన, భవము దరికి రాదు. 39

పగటి వేళల నుపవాసమ్ములం బుచ్చి
నిశల గోవులఁ జంపు నిష్ఠురులకు,
ఇంటింట హింస చేయించుచు కాజీల
మంచు బోధలు సేయు వంచకులకు,
సత్యదయాశౌచ సద్గుణమ్ముల వీడి
వ్యభిచరించెడి దుష్టవర్గమునకు,
జీవితంబెల్ల దుశ్శీలురై గడపుచు
మాలలు త్రిప్పు దుర్మార్గులకును,

ఆ దయారాశి, నిత్య సత్యస్వరూపు,
నా నిరంజను, నవ్యయు, నమృతమయుని
అక్షర క్షర తత్త్వాతీతాత్మునందఁ
గాదటంచు కబీరు నిక్కము వచించు 40

సీరసంగను దప్పి తీఱువే కడుపార
మంచినీరములు సేవించకుండ,
అగ్గి యన్నంతనే అఱకాలు కాలునే
పాదంబు నిప్పుపైఁ బడకయుండ,
అన్న మన్నంతనే ఆకలి తీరునే
మృష్టాన్నమును తుష్టి మెసవకుంత,
తేనె యన్నంతనే తీయనౌనే నోరు
మధువు నాలుకమీద మసలకుండ,

అట్లె- రామ, శ్రీరామ యన్నమాత్ర
తత్త్వమెఱుగక, సద్గురుదయఁ బడయక,
బుద్ధిపక్వము గాకుండ పొందలేఁడు
నరుఁడు మోక్షము వేయి జన్మముల కయిన ;
అని కబీరు వచించునో యన్నలార ! 41

అంతరంగము పక్వమై యలరకుండ,
సద్గురూత్తముదయ పొందఁజాలకుండ,
పరమతత్త్వ సాక్షాత్కృతిఁ బడయకుండ,
రామ యన్నంతమాత్రనే రాదు ముక్తి. 42

నామ జపస్మరణంబులు,
నీమది దోషములఁ దొలఁచి నిలకడగూర్పన్
వేమఱు సలుపఁగవలె నని
రామానందుఁడు వచించెరా! శిష్యునితో. 43

అంతమాత్రమున సిద్ధి అబ్బదురా, తండ్రి!
నరుని సత్ప్రవర్తనమును బట్టి,
అంతరంగశుద్ధి ననుసరించియు ముక్తి
గలుగునని వచించె నిల కబీరు. 44

అతని దర్శనమ్ము నందకుండఁగ, వానిఁ
దాఁకకుండ, పేరు తడవినంత
ముక్తి గలుగునేని, ముక్తు లెవ్వరు కారు?
చిలుక రామ యనుచు పలుక దొకొ! 45

ధనము పేరుచెప్ప, ధనవంతు డగునేని,
ఒక్కఁడైన పేద యున్నె జగతి?
కష్టపడక, డబ్బు గడియింపఁ గానట్లు,
ముక్తి రాదు యోగశక్తి లేక! 46

రామభజన చేయ ప్రాలుమాలుచువేని,
యముని పట్టణమున కరుగవలయు;
రామభజనమర్మ మామూలము నెఱింగి
చేయుమని కబీరు చెప్పు నరుఁడ! 47

విషయరూప మెత్తి వేధించు నిను మాయ,
దానిమర్మ మెఱుఁగఁ దరము గాదు:
అనుభవింపఁ జూతు వది యథార్థమటంచు;
దానిఁ జూచి నవ్వు తత్త్వవేత్త. 48

పుట్టినపుడు మైల, గిట్టినప్పుడు మైల,
మైలలోనె జగము మసలుచుండె;
ఎవనిలోన మాయ యిసుమంత యుండదో !
వాఁడె మాయలేనివాఁడు నిజము ! 49

ఎవనికొఱకు లోకమెల్ల గాలించెదో
వాఁడు హృదయమందె వఱలుచుండె;
దివ్వె చేతఁబట్టి తిరుగుదే యగ్గికై ?
వెంగలీ ! కబీరు వెక్కిరించు. 50

ఆ ఖురానుతత్త్వ మరయు మౌలానాలు,
వేదమర్మ మరయు వైదికాళి
ఎఱుఁగఁజాల రింత ఈశ్వరతత్త్వంబు,
ఎఱుఁగు గురునిశిక్ష నేయొకండొ ! 51

ఆ ఖురానుమాయలందు మౌలానాలు!
శాస్త్రమాయలోన శాస్త్రులెల్ల
చిక్కుకొనిరి; మాయఁ జేరనీయనివాని
పొందఁగలరె? మాయపొందు విడక. 52

కాశిఁ గాలమంత గడపినవాఁడను,
మగధ(న్) మట్టిలోన మట్టి గలియ
అవ్యయామృతత్త్వ మందితి, అందించి
విశ్వమునకు నాదు విమల బోధ ! 53

—o—

# కృతినాయకుల పరిచయము

1. లోచూపూ, వెలిచూపూ ప్రసాదించే లోకబాంధవుడూ, సర్వోదయ రథసారథీ, సామ్యయోగీ అయిన- డా॥ వెంపటిసూర్యనారాయణగారు.

2. ఇరువదిరెండేండ్లు నిండీనిండని లేతప్రాయంలోసంస్కృతాంధ్రాంగ్ల హిందీభాషాపరిధులలో పరిభ్రమించి, శ్రీ ముమ్మడిసింగు వెంకట సుందరరావు(ఇంజనీరు)కు అర్ధాంగియై, ఉభయవంశములను యశోభూషలతో అలంకరించి,అకాల మృత్యుదేవత ఒడిలో హాయిగా నిద్రించిన ఆత్మజాత శ్రీమతి వసుంధరాదేవి.

3. అనేక ప్రభుత్వపదవులను నిర్వహించి, విశ్వశిల్పి-పంచాయతీరాజ్య పత్రికలకు సంపాదకులై, పలురంగములలో నిర్విరామ సేవ సలుపుచున్న సుకృతి శ్రీ చిట్టావూరు నాగభూషణాచార్యులుగారు.

4. కవీ, శిల్పీ, మనస్వీ, మనీషీ, తాత్వికుడూ అయిన మిత్రులు శ్రీ సూర్యదేవర సంజీవదేవ్‌గారు.

5. విశ్రాంత విద్యాశాఖాధినేత, కవితా - గణితావధానవిధాత, సంస్కృతాంధ్రాంగ్ల కావ్య నిర్మాత, శ్రీ తత్త్వానందస్వామి పాదానుధ్యాత అగు శ్రీ పులివర్తి శరభాచార్యమహాకవి.

6. పూర్వాశ్రమంలో శ్రీ కొండివర్తి వీరభద్రాచార్యులుగా డా॥ పట్టాభి, ముట్నూరి కృష్ణారావు, కోపల్లె హనుమంతరావు ప్రభృతులతో కలసి జాతీయోద్యమాదులలో సేవచేసి,ఆదర్శసన్న్యాసాన్ని స్వీకరించి తత్త్వానంద అయి, మహాగ్రంథకర్తగా ముక్తిని చూఱలాడిన శ్రీ తత్త్వానంద స్వాములవారు.

7. ఈ రచయితచేసే శిల్ప, సాహిత్య, కవిత్వ, యోగ, వేదాన్త కృషులకు మురిసిపోతూ, వీరి ప్రతిపుస్తకంమీద అమూల్యాభిప్రాయాలను అందిస్తూవచ్చిన ఋషికల్పులు శతావధాని కీ. శే. వేలూరి శివరామశాస్త్రిగారు.

8. బ్రిటిష్‌వారి హయాములో డిప్యూటీకలెక్టర్ మొదలైన ఉన్నతోద్యోగాలను నిర్వహించి రావుసాహెబ్ బిరుదాన్ని పొందడమేగాక, యమబద్ధజీవనులై "ఋషికల్పుండు పరాంగనా పరధనాపేక్ష విదూరుండు శేము షివాచస్పతికుద్ది"అని శ్రీ దుర్భా సుబ్రహ్మణ్య శర్మగారి ప్రస్తుతులను అందుకొని, చరమజీవితాన్ని రామకృష్ణ మత సేవలోగడపుతూ వివేకానందాదుల ఆధ్యాత్మిక సారస్వతాన్ని ఆంధ్రీకరించిన సత్త్వశీలుడు కీ.శే.కందుకూరు మల్లికార్జునంగారు.

9. శ్రీమత్సావిత్రీపీఠపాలకులై వేదవేదాంగవేత్తయై విజయనగర ప్రభువులైన శ్రీ మద్విజయరామరాజుగారి దర్బారులో రథకారుల బ్రాహ్మణత్వమును గూర్చి క్రీ. శ. 1756 లో దిగ్గంతులవంటి పండితులనెదిరించి వాదించి, విజయఘంటికలు కైకొనడమేకాకుండ పేరూరిలో బ్రహ్మరథోత్సవసత్కారం పొంది "పేరూరిబ్రహ్మ రథారూఢ" బిరుదాన్ని అందుకొని రథకారాధికరణ, విశ్వవిద్యాభరణ గ్రంథకర్తలై ప్రకాశించిన శ్రీ కనపర్తి బసవాచార్య స్వాములవారు. బ్రహ్మంగారు "పుష్పగిరి బ్రహ్మరథారూఢ" బిరుదాంకితులు కాగా, వీరు "పేరూరు బ్రహ్మరథారూఢ" బిరుద విభ్రాజితులైనారు. ఈశతకంలోని వేదసమ్మతాలైనభావాలు అనేకం వీరు ప్రచారంచేసినట్టివే.

10. సంస్కృతాంధ్రములందు మహోద్దండ పండితులూ, కవులూ అయి కల్యంధకౌముదీ, కుమారాభ్యుదయ, బ్రహ్మానందలీల, మాఘ మాహాత్మ్య కావ్యములకు స్రష్ట అయి "విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమ' గ్రంథసంగ్రహీతలైన కవిశేఖరులు-కీ॥ శే॥ వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారు. వీరిచరిత్రను "నిరంజన విజయము'' అనే పేరుతో ఈకవి వ్రాసియున్నారు.

—o—

# గ్రంథ ముద్రణకు సాయపడిన ఉదారులు

శ్రీ కొలనూరు రామస్వామిగారు B. A. L. L. B.
అడ్వకేట్, నిజామాబాద్. రు. 216

## రు. 116 లు. ఇచ్చి సాయపడినవారు

1. శ్రీ విరాట్పోతులూరివీరబ్రహ్మేంద్ర స్వాములవారి మఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ వీరభోగవసంత వేంకటేశ్వర స్వాములవారు
కందిమల్లయపల్లె. కడపజిల్లా.

2. శ్రీ శ్రీ శ్రీ రామకృష్ణానంద స్వాములవారు
ఆళ్ళగడ్డ. కర్నూలుజిల్లా.

3. డా॥ వి. రుక్మారావుగారు. M. A. Ph. D.
Principal College of Education. Osmania university, Hyderabad.

4. డాక్టర్: మునుగంటి కృపాచార్యులుగారు M.A.PhD.
సంస్కృతోపన్యాసకులు, ప్రాచ్యకళాశాల. శారదానికేతనం, గుంటూరు.

5. మహాశిల్పి ; శ్రీ దురుగడ్డ బాలవీరాచార్యులుగారు.
శారదాశిల్ప శిక్షణ కేంద్రం, ఆళ్ళగడ్డ.

6. శ్రీ రామారూరల్ కళాశాల గురుకులమువారు.
చిలుమూరు. తెనాలితాలూకా.

7. శ్రీ అత్తలూరి సూర్యనారాయణగారు.
సూర్యోపాసకులు, నరసరావు పేట.

8. శ్రీ చోడా రాధాకృష్ణమూర్తిగారు, విజయవాడ.

9. శ్రీమాన్ తమిరిశ లక్ష్మణాచార్యులుగారు. తెనాలి.

10. శ్రీ విష్ణుభట్ల గోపాలకృష్ణమూర్తిగారు.
ఫ్యాన్సీషాపు. తెనాలి.

11. శ్రీ ఆరెపాక నాగభూషణంగారికుమారుడు సుబ్బారావు
గారు. Draughtsman K.C.P.LTD. వుయ్యూరు.

12. శ్రీ శనగపాటి మధుసూదనరావుగారు.
Retd. Superintendent. P.W.D. Work Shop
సీతానగరం గుంటూరు Dt.

13. శ్రీ బేతపూడి సుందరాచార్యులుగారు.
ప్రొప్రయిటర్. సుందరం అండ్ కంపెని మిలు స్టోర్సు,
నేషనల్ రైస్ అండ్ ఫ్లోర్ మిల్లు, నరసరావు పేట.

14. శ్రీ వెల్లూరి బాలబ్రహ్మంగారు. B.E.M.F.I.
ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ M.P.D జగిత్యాల.

15. శ్రీ తుమ్మనపల్లి లక్ష్మీరాజయ్యగారు.
స్వర్ణకారసంఘాధ్యక్షులు, జగిత్యాల.

16. శ్రీ తుమ్మనపల్లి చంద్రయ్యగారు. ,,

17. శ్రీ తుమ్మనపల్లి రాజయ్యగారు. ,,

18. శ్రీ తుమ్మనపల్లి మీనయ్యగారు. శాంతినికేతనం జగిత్యాల.

19. శ్రీ శ్రీపాద హనుమయ్యగారికుమారుడు లక్ష్మీనారాయణ
గారు. క్లాత్‌మర్చంటు. జగిత్యాల.

20. శ్రీ శ్రీరామోజు చినరత్నయ్యగారు.
శ్రీరామా డైమండ్సుమర్చంట్ కరీంనగరం.

21. శ్రీ కొలనూరు కృష్ణయ్యగారు. సిరిసిల్లా.

22. శ్రీ వెల్లలచెఱువు భ్రమరాచార్యులుగారి కుమారుడు
శ్రీ కోట్లింగాచార్యులుగారు వెల్లలచెఱువు. ప్రకాశం Dt.

23. శ్రీ అయిలా అంబయాచార్యులుగారు పెంబర్తి.

1. శ్రీ వెగ్గళం వాసరయ్యగారు సిరిసిల్లా. రు. 66

2. శ్రీ కోసూరి నూకరాజాచార్యులుగారు.
ప్రొప్రయిటరు : దుర్గాఇండస్ట్రీస్, విజయవాడ-1 రు. 58

3. శిల్పి శ్రీ దురుగడ్డ రామాచార్యులుగారు, ఆళ్ళగడ్డ
తండ్రిగారైన మహాశిల్పి కీ॥ శే॥ వీరభద్రాచార్యులువారి
జ్ఞాపకార్థము. రు. 50

# సవరణలు.

| పుట. | పంక్తి | ఉన్నది. | ఉండవలసినది. |
|---|---|---|---|
| 1. | 6. | మట్టువెటు | మట్టువెట్టు |
| 24. | 3. | సంస్కృతాధ్రాంగ్ల | సంస్కృతాంధ్రాంగ్ల |
| 26. | 14. | లోకకీ | లోకకీర్తి |
| 31. | 18. | దైవతము | దైవతములీ |
| 47. | 14. | పమాదపడడె | ప్రమాదపడడె |
| 56. | 3. | వెఱుంగనొ | వెఱుఁగనొ |
| 66. | 6. | సర్వజీవకోటిస్వాత్మ | అఖిలజీవకోటివాత్మ |
| 70. | 5. | కడగండ | కడగండ్ల |
| 77. | 17. | గొప్పవాడ్రు | గొప్పవాఁడు |
| 102. | 11. | వలయుసూ | వలయుఁజూ |
| 110. | 17. | బ్రహ | బ్రహ్మ |
| 113. | 10. | యోమహి | యోగమహిమ |
| 121. | 19. | ఆత్మపౌఖ్య | ఆత్మసౌఖ్య |
| 143. | 13. | జానమే | జ్ఞానమే |
| 150. | 1. | ప్రయాణంబు | ప్రయాణంబ |
| 164. | 14. | వేత్త్వ | వేత్త |
| 178. | 3. | మేమన్న | వేమన్న |
| 183. | 9. | సిదాంతాల | సిద్ధాంతాల |
| 185. | 10. | జానమనఁగ | జ్ఞానమనఁగ |
| 193. | 14. | తటాము | తట్టాము |
| 194. | 4. | వికృతి | వికృతు |
| 195. | 16. | దధివేదిక | దధికవేది |
| 209. | 3. | పగులగొటుదె | పగులగొట్టుదె |
| 215. | 15. | ర్త, | కర్త, |



# ఇతర కృతులు:

—o—

| | | |
|---|---|---|
| 1. శ్రీ వీరరాఘవ వ్యాసావళి | రు. | 12–00 |
| 2. లేపాక్షి (చారిత్రకనవల) | ,, | 6–00 |
| 3. మోహనాంగి ,, | ,, | 5–00 |
| 4. మన గురుదేవుడు (బ్రహ్మంగారి చరిత్ర) | ,, | 5–00 |
| 5. అమరావతి (పద్యకావ్యం) | ,, | 4–00 |
| 6. వీరబ్రహ్మ సుప్రభాతమ్ | ,, | 2–00 |
| 7. ఆత్మదర్శనము (అచ్చులో) | ,, | 10–00 |



# శిల్పదర్శనము: రూ. 12-00

పలువురు మహాపండితులు ప్రశంసించిన శిల్పతత్త్వప్రకాశకమైన గ్రంథరాజం. "శిల్పదర్శనము- శాస్త్రగ్రంథం ప్రామాణికమైంది. దీన్ని "శిల్పవిజ్ఞాన సర్వస్వ సంగ్రహం" అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. నిజంగా ఇంతటి విలక్షణ దార్శనికుడు తెలుగుదేశంలో పుట్టినాడంటే తెలుగుజాతికే గర్వకారణం. .... ఏవో కొన్ని పుస్తకాలు మాత్రమే 'ప్రామాణిక గ్రంథాల' కోవకు చెందుతవి. వాటి అనువాదాలు దేశానికే గౌరవాన్ని చేకూరుస్తాయి. మీదుమిక్కిలి జాతీయ ఐక్యతకు దోహదం చేస్తవి. ఇదివరకే ఇందలి కొన్నిభాగాలు కన్నడంలోకి అనువదించ బడినవట! మొన్నమొన్ననే హైదరాబాదులో స్థాపించబడ్డ "హిందీప్రతిష్ఠాన్" వంటి సంస్థ ఆదానప్రదాన కార్యక్రమానికి పూనుకొని, ఏనాడో అచ్చుపడ్డ హిందీ గ్రంథాలకు బహుమానాల నియ్యడంతోపాటు ఇటువంటి తెలుగు మూలగ్రంథానికి హిందీ అనువాదం చేయించి ప్రచురిస్తే ఉభయతారకంగా ఉంటుంది. అంటే ఒకటి – దాక్షిణాత్యులు హిందీ పుస్తకం ప్రచురించటం, రెండోది– ఆంధ్రుల ఆర్షవిజ్ఞాన ప్రతిభను చాటడం."

— నెల్లుట్ల మాణిక్యరావు

"ఆంధ్రప్రభ" సచిత్ర వారపత్రిక 7-2-79

---

# యోగదర్శనము రూ. 15-00

భారత ఉప రాష్ట్రపతి శ్రీ జట్టి, పలువురు తత్త్వజ్ఞులు ప్రశంసించినట్టిది.